
PARLE
POPPINS
Goli Rainbow Wali - Doon Kya?
Ram and Shyam
డెకాట్రిక్స్‌ని పట్టుకోవడం
భాగం-3
తర్వాయి భాగం...


డెకాట్రిక్స్‌లోగల 10లోని ఏదైనా శక్తి కోసం పిల్లలు ఆదే రంగు పాపిన్స్ తినవలసి ఉంటుంది.
ఈ 10 శక్తులు ఇదిగో:
స్పీడ్– ఈ శక్తి స్పీడ్‌ని సూపర్–ఫాస్ట్ చేస్తుంది. ఏదైనా పనిని ఎంతో వేగంగా చేయగలుగుతుంది.


ఫ్లైట్: దీని సహాయంతో దీన్ని ధరించిన వారు గాలిలో ఎగరవచ్చు


షేప్-షిఫ్టర్‌తో ఏదైనా స్వరూపం లేదా ప్రాణి రూపాన్ని దాల్చవచ్చు.


సూక్ష్మం– దీనిని ధరించినవారు అణువంత చిన్న రూపాన్ని దాల్చవచ్చు.


ఇన్విజిబిలిటి– దీనితో మాయమయ్యే శక్తి దొరుకుతుంది


జాయింట్–దీనితో మీరు 100 అడుగుల ఎత్తు కావచ్చు


స్ట్రెచ్- దీన్ని ధరించినవారు వారి శరీరాన్ని ఎంతైనా సాగించవచ్చు


ఫిషియన్ సహకారంతో దాన్ని ధరించినవారు వారిలాంటి ఎన్నైనా క్లోన్‌లను తయారు చేయవచ్చు.


స్ట్రెంథ్–దీన్ని ధరించినవారికి చెప్పలేనంత శక్తి వస్తుంది. వారు వెయ్యి ఏనుగులంత శక్తివంతులవుతారు.


ఫోర్స్ ఫీల్డ్–దీని సహాయంతో మీరు ఒక శక్తివంతమైన ఫోర్స్ ఫీల్డ్‌ని తయారుచేయవచ్చు.

# telugu.chandamama.com

## ఆన్‌లైన్ చందమామలో బోలెడు కథలు, వింత వార్తలు...



ప్రాణంగా ప్రేమించిన 'కానుగ చెట్టు'ను కూల్చివేస్తే.. పసిబాలుడి అంతరంగం క్షోభించదా?

లంచ్ బాక్స్‌లో ఆక్టోపస్, మీ ఇంట్లోకి కంగారూ వస్తే, కోతులకూ బట్టతలే, ఆనకొండ.. మొదలైన కథలూ, వింత వార్తలు.. చదవదలిచారా?







telugu.chandamama.com లో జానపద కథలు, లోకజ్ఞానం చూడండి.

# ఈ సంచికలో...



చందమామ

సంపుటి: 62 ఆగస్ట్ 2009 సంచిక: 08













# ముందుకు సాగుదాం!

అరవై రెండవ స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకుంటూన్న ఆనంద సమయం ఇది. గత ఆరు దశాబ్దాల కాలంలో మనం సాధించిందేమిటి? సాధించలేకపోయిందేమిటి? అన్న విషయాలను గురించి ఆలోచించడానికి అనువైన తరుణం ఇది. భావి భారత పౌరులుగా మన శక్తియుక్తులను పెంపొందించుకుంటూ, లోపాలను సరిదిద్దుకుంటూ, సాధించినవాటిని సుస్థిరపరచుకుంటూ, సాధించవలసిన వాటిని పథకం ప్రకారం సాధించుకుంటూ ముందుకు సాగడానికి ఈ సింహావలోకనం ఎంతయినా ఉపయోగపడుతుంది.

మన భాగ్యవిధాతలు, మన విధి నిర్ణేతలు మనమే అన్నది మనం మొట్టమొదట గుర్తించవలసిన మహత్తర సత్యం. జీవితంలో ఏం చెయ్యాలి? ఏం సాధించాలి? అని నిర్ణయించే శక్తి ప్రతి ఒక్కరికీ ఉన్నది!

ఇవాళ సత్వర ఆర్థిక ప్రగతిని సాధిస్తూన్న దేశాలలో మన దేశం ముందెన్నదగినదిగా ఉన్నది. మన శక్తి సామర్థ్యాలను, ప్రతిభా పాటవాలనూ పెంపొందించుకుని పరిపుష్టం చేసుకునే విధంగా మన పెద్దలు వేసిన పునాదులే ఇందుకు ప్రధాన కారణం. మన వ్యాపారవేత్తలలో కొందరు ప్రపంచ సంపన్నుల జాబితాలో స్థానం సంపాదించడం ఆనందించతగ్గ విషయం!

విద్య, వైజ్ఞానిక రంగాలలోనూ మనం అసాధారణమైన అభివృద్ధిని సాధిస్తున్నాం. అన్నిటికీ మించి ప్రజాస్వామ్య దేశంగా కొనసాగుతూ, ప్రజాస్వామ్య పరిరక్షణలో మన దేశం ఇతర దేశాలకు ఆదర్శంగా వెలుగొందుతున్నది. ఈ వాస్తవాన్ని ఒకటి రెండు సార్లు కాదు; గతంలో పద్నాలుగు సార్లు నిరూపించాం! ఇవన్నీ కూడా మనమెంతో గర్వించతగ్గ అంశాలు!

ఇక, నాణానికి మరో వైపు చూద్దాం. ఇంకా మన దేశంలో దారిద్ర్యరేఖకు దిగువ ఉన్న పేదలు అధిక సంఖ్యలోనే ఉన్నారు. పేద-ధనిక వర్గాల మధ్య అంతరాలు రోజురోజుకు పెరిగి పోతూనే ఉన్నాయి. ఇది అనేక అనర్థాలకు దారితీసే ఆందోళనకర విషయం. అదే విధంగా గ్రామ సీమలు-పట్టణాలు, స్త్రీలు-పురుషుల మధ్య నెలకొన్న అసమానతలను తొలగించడానికి పూనుకోవాలి.

దేశంలో అప్పుడప్పుడు అక్కడక్కడ కులమతాల ఘర్షణలు ఇంకా చెలరేగుతూనే ఉన్నాయి. మనల్ని ఉన్నతులుగా భావించడంలో తప్పులేక పోవచ్చుగాని, ఎదుటివారిని తక్కువగా చూడడం మానవతకు మచ్చతెచ్చే బాధాకర విషయం.

ఇలాంటి అవరోధాలను అధిగమించడానికి ప్రతి ఒక్కరూ బద్ధకంకణులు కావాలి. అప్పుడే దేశ సర్వతోముఖాభివృద్ధి సాధ్యమవుతుంది. స్వాతంత్ర్యం అన్న మాటకు సార్థకత సిద్ధిస్తుంది.

పాఠకులందరికీ హృదయపూర్వక స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు!

సంపాదకుడు : ఎల్. సుబ్రహ్మణ్యన్


ఆగస్ట్ 2009 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

***Chairman :*** B. Viswanatha Reddi (Viswam)
***Editor & Publisher :*** L. Subramanyan
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** T. Venkatesan
***Asst. Editor-Copy & Pre-Production :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi
***Layout Designer :*** K. Narendra Raju
***CIRCULATION TEAM :***
***Chennai :*** **T N Ravi Shankar,** ***National Sales Manager***, Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan,** ***Manager-Circulation & Institutional Sales - South***, Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
***Mumbai :*** **Rajendra K Jadhav,** ***Asst. Manager - Circulation***, Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industry, Opp. State Bank of India, Near Police Station Cross Road, No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
***New Delhi :*** **Sushil Sharma,** ***Circulation Manager-North,*** Mobile +91 99110 91022
**CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
***Bangalore :*** **P. Murali,** ***Asst. Circulation Manager -Karnataka***, Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
***Kolkata :*** **Ananth Prakash,** ***Circulation Manager-East,*** Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
***Ahmedabad :*** **Kalpesh Raval,** ***Sales Officer-Circulation*** Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
***Content Head - Online :*** **Sowmya Bharadwaj**
email : online@chandamama.com
***For Marketing Enquiries :***
email : marketing@chandamama.com
***Advertisement :***
email : sales@chandamama.com
***Subscription Queries:*** L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
***Customer Cell :*** A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Production Executive :*** Panchakshari R Math
***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by L. Subramanyan at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, 2/513, Sundeep Avenue East, 2nd Main Road, Thiruvanmiyur, Chennai - 600 041. Editor : L. Subramanyan

# పాఠకుల లేఖలు

 **'చందమామ'**ను ఆకర్షణీయంగా తీర్చిదిద్దుతూ ఉన్నత శిఖరాలకు తీసుకెళుతున్నారు. చాలా సంతోషం. కాని ప్రతి చిన్న విషయానికీ కంప్యూటర్‌లో చూడమనీ, ప్రతి పేజీలో కూడా కొన్నింటికి ఎస్ఎంఎస్ చేయమనీ చెబుతున్నారు. చందమామ చదివే ప్రతి పాఠకుడి ఇంట్లోగాని, విద్యార్థి దగ్గరగాని కంప్యూటర్ పరిజ్ఞానం లేకపోవచ్చు. మరి అలాంటి వారి పరిస్థితి ఏమిటి? అందుకే కొన్ని పాత పద్ధతులను విస్మరించకండి. మీరు అందించే చక్కని శీర్షికలు, కథలు అందరికీ అందుబాటులో ఉండేలా చూడండి.

-పులిజాల రవీందర్ రావు, హైదరాబాదు

 ఏళ్ళ తరబడి ఆకాశంలో విహరించిన చందమామ కాలుష్యంతో కూడిన భూలోకానికి దిగిపోతున్నది. దీనికి నిదర్శనంగా జానపద వాతావరణం, వెన్నెల, చెట్టుకింద బాటసారి, అడవి జీవితం అంతరించి క్రికెట్ వీరులు, కళ్ళద్దాలు, మోడర్న్ డ్రెస్సులు చందమామలో చోటు చేసుకుంటున్నాయి. అంటే మాలాంటి వాళ్ళకు చందమామ వీడ్కోలు చెప్పేస్తుందా? కేవలం రామాయణం ఘట్టాన్నే ముఖచిత్రంగా పెట్టుకొన్న చందమామ క్రికెట్ వీరులకు చోటిచ్చిందంటే బాధ కాక మరేమిటి? ఆలోచించండి!

-డా.పి.ప్రభావతి, భట్టిప్రోలు, ప్రకాశంనగర్, హైదరాబాదు

## ఎస్ఎంఎస్ ద్వారా

 ఆర్య, అసలు సంగతులు, ఇరాక్ కథ ఆసక్తికరంగా లేవు.

-హరికృష్ణ(ఆం.ప్ర.)

 దయచేసి చందమామ ముఖచిత్రాలు మార్చకండి. సంప్రదాయశైలిలోనే చిత్రాలు, కథలు కొనసాగించండి. -రవి(ఆం.ప్ర)

 జూన్ నెల 'పద్మగంధి పుష్పం' చాలా బావుంది. మూగవాడు ఆసక్తికరంగా ఉంది. -అకుల ఆంజనేయులు(ఆం.ప్ర)



మీ అభిప్రాయాలను ఈమెయిల్ feedback@chandamama.com ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.

# స్వాతంత్ర్య దినోత్సవం

## అరుదైన త్యాగఫలం!



యేటా ఆగస్టు పదిహేనవ తేదీ బడిలో పతాకావిష్కరణకు హాజరుకావడం పిల్లలందరికీ ఆనందం కలిగించే విషయం. ఆకాశంలో హుందాగా ఎగిరే మువ్వన్నెల జెండాను చూసి గర్వంతో ఉప్పొంగని యువ హృదయం ఉండదు. సరే, ఇప్పుడు మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన 1947 ఆగస్టు 15వ తేదీ ఏం జరిగిందో తెలుసుకోవడానికి ఒక్కసారి వెనక్కు తిరిగి చూద్దామా...

అర్ధరాత్రి సమయం. జనం నిద్రపోకుండా రాజధానీ నగరంలో ఒక్కొక్క ఇంటినీ, వీధినీ దీపాలతో అలంకరించారు. జవహర్‌లాల్ నెహ్రూ పతాకావిష్కరణ చేయనున్న ఎర్రకోట వద్దకు జనం తండోపతండాలుగా తరలివెళ్ళారు. నెహ్రూ పతాకావిష్కరణ చేయగానే ప్రజలు ఆనందోత్సాహాలతో చేసిన కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. భారత దేశ ప్రజలనుద్దేశించి జవహర్ లాల్ నెహ్రూ చారిత్రాత్మక 'ట్రిస్ట్ విత్ డెస్టినీ' ఉపన్యాసం చేస్తూండగా ఉత్సాహపూరితుడైన ఒక దేశభక్తుడు ఆనందాతిరేకంతో అందరి దృష్టినీ ఆకర్షించే విధంగా శంఖారావం చేశాడు!

మన స్వాతంత్ర్యాన్ని చాటే పతాకావిష్కరణ హక్కు మనకు అంత సులభంగా లభించలేదు. స్వాతంత్ర్యోద్యమ సమయంలో మువ్వన్నెల జెండాను ఎగురవేసి పరాయి పాలనకు వ్యతిరేకతను వెలిబుచ్చేవారు. స్వాతంత్ర్యం రావడానికి కొన్నేళ్ళ ముందు ఒకసారి కారాగారంలో ఉన్న స్వాతంత్ర్య సమరయోధులు కారాగారం లోపలే ఎలాగైనా జెండాను ఎగురవేయాలని నిర్ణయించారు. కాని అందుకు కావలసిన స్తంభం అక్కడ లేదు. అయినా వాళ్ళు తమ పట్టుదలను వదులుకోలేదు. మంచాలను ఒకదానిపై ఒకటి నిలువుగా నిలబెట్టి .దాన్నే పతాకస్తంభంగా చేసుకుని జెండాను ఎగురవేశారు!

దిక్కులు ప్రతిధ్వనించేలా దేశభక్తి గీతాలను ఇనుమడించిన ఉత్సాహంతో ఆలపించారు!

స్వాతంత్ర్యం దానంతట రాలేదు. దానిని సాధించడానికి మన పెద్దలు పడ్డ కష్టాలు ఇన్నన్ని కావు. గొప్ప గొప్ప త్యాగాలు చేశారు. మన త్రివర్ణ పతాకం స్తంభం మీద ఎగిరే జెండా మాత్రమే కాదు. మన పెద్దలు చేసిన అద్భుత త్యాగాలకు సంకేతం. జెండాను ఎగురవేస్తున్నప్పుడు ఆ త్యాగమూర్తులను స్మరించుకుని నివాళులర్పించడం ప్రతి పౌరుడి కర్తవ్యం.

అందరికీ చందమామ స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు!

8

# Avail the Coolest Combo Pack!i




## Buy Chandamama's Collector's Edition+Ramayana for Rs ~~898~~ 673* Only!



Chandamama's Ramayana is the first fully Illustrated Ramayana which comes in a single book.

Chandamama Collector's Edition features the best of Chandamama published over the last 60 years.



I want the Coolest Combo Pack:

Name.................................................... Subscriber No ....................................

Address....................................................................................................

City ........................ State ........................ Pin ........................

Telephone ........................ Mobile ........................ Email ........................

Enclosed Cheque/DD for Rupees (in words) ..................................................

Cheque/DD no ........................ Favouring Chandamama India Ltd

on ........................................................ bank. *(Send At-Par cheques or add Rs 60 for non-Chennai cheques)*

Please mail the order form to :

Chandamama India Limited, No. 2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelangarai, Chennai – 600 041. Phone: (044) 43992828

Email: chandamama@chandamama.com Web: www.chandamama.com

Both these titles are available only in English at all leading bookshops.

To place an order go to www.chandamama.com

*For purchase outside India, the Coolest Combo Pack is available at ~~$100~~ $80



బేతాళ కథలు

# విలుకాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఏ మిత్రుడికి సాయపడడానికి లేదా ఏ శత్రువు మీదపగసాధించడానికి నువ్విలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయినా మైత్రీద్వేషాలు శాశ్వతాలు కావు. మిత్రులు శత్రువులు కావడం, శత్రువులు మిత్రులుగా మారడం సహజం. అధికార గర్వి తులైన పాలకుల విషయంలో ఇది మరీ సర్వ సాధారణం. ఎప్పుడు ఎలాంటి నిర్ణయం తీసు కుంటారో ఎవరికీ తెలియదు. ఈ విషయం సుస్పష్టం కావడానికి బాల్యం నుంచి ద్వేషిం చిన ఒక విలుకాణ్ణి చివరికి అపూర్వ రీతిలో సత్కరించిన శివసేనుడనే యువరాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

శివపురి రాజ్యంలోని కొండతేనెగూడెంలో శిఖిముఖి అనే వేటగాడు ఉండేవాడు. విలు



విద్యలో వాడిది అందెవేసిన చెయ్యి. వేటకు వెళ్ళి బాణం గురిపెట్టి వదిలాడంటే ఎంతటి క్రూరమృగమైనా నేలకూలవలసిందే.

శిఖిముఖికి పెళ్ళయి ఒకకొడుకు పుట్టాడు. వాడికి బాణుడు అని పేరుపెట్టి ఐదేళ్ళ వయసు నుంచే విలువిద్య నేర్పసాగాడు. కొడుకును తనను మించిన వీరుడిగా తయారు చేయాల న్నది వాడి కోరిక.

బాణుడికి కూడా విలువిద్య పట్ల మంచి ఆసక్తి ఉండేది. ఎప్పుడు చూసినా విల్లంబు లతోనే గడిపేవాడు. పదేళ్ళ వయసుకే తండ్రి నుంచి విలువిద్యలోని మెళకువలన్నీ నేర్చుకు న్నాడు. శిఖిముఖి కొడుకును తనతో పాటు జంతువులను వేటాడడానికి అడవికి తీసుకు వెళ్ళాలని అనుకుంటూండగా బాణుడు, ''నాన్నా, నాకు వేటమీదకంటే ఇతర క్షాత్ర విద్యలు నేర్చుకోవాలని ఆశగా ఉన్నది,'' అన్నాడు.

శిఖిముఖి కొడుకు మాటలు విని పరమా నందం చెందాడు. మంచి రోజు చూసి వాణ్ణి తీసుకువెళ్ళి ధర్మనిరతుడు అనే గురువు దగ్గర శిష్యరికానికి అప్పగించాడు. ఆయన దండ కారణ్యం సమీపాన గురుకులం నడుపు తున్నాడు.

ఆ సమయంలో శివపురిరాజు శూరసేనుడి కుమారుడు శివసేనుడు కూడా ధర్మనిరతుడి గురుకులంలో విద్యాభ్యాసం చేస్తున్నాడు. సమవయస్కులైన శివసేనుడికీ, బాణుడికీ స్నేహం కుదిరింది. చదువు సంధ్యలతో పాటు ఖడ్గచాలనం, గదాయుద్ధం, అశ్వారోహణం వంటి విద్యలలో శివసేనుడు బాణుడికి మించిన ప్రతిభ కనబరచేవాడు. విలువిద్యలో మాత్రం బాణుడు శివసేనుడికన్నా ఎక్కువ ప్రతిభ ప్రదర్శించేవాడు. అది చూసి శివసేనుడు అసూయతో కుతకుతలాడి పోయేవాడు. క్రమంగా అసూయ కనిపించని పగగా మార సాగింది.

గురువు ధర్మనిరతుడు సైతం శివసేనుడు భవిష్యత్తులో కాబోయే రాజు కాబట్టి అతణ్ణి విలువిద్యలో కూడా బాణుణ్ణి మించిన ప్రతి భాశాలిని చేయాలని ఎంతో ప్రయత్నించాడు. కాని, వీలు కాలేదు.

బాణుడు తాను ఏనాడూ శివసేనుణ్ణి మించిన ప్రతిభాశాలినన్న గర్వం చూపలేదు. స్నేహభావాన్ని వీడలేదు. ''మిత్రమా! ఖడ్గ చాలనం, గదాయుద్ధం, అశ్వారోహణం మొద

లైన వాటిలో నువ్వు సాటిలేని మేటివి కదా?'' అని మనసారా అభినందించేవాడు వినయంగా. అయినా శివసేనుడికి మాత్రం రోజురోజుకూ బాణుడిపట్ల అసూయా ద్వేషాలు ఎక్కువ కాసాగాయి.

ఇలా ఉండగా ఒకసారి ధర్మనిరతుడు గురుకులంలో హోమం చేయాలని సంకల్పించాడు. అందుకు కావలసిన సమిథలు సేకరించుకుని రావడానికి శివసేనుడు, బాణుడు అడవిలోకి వెళ్ళారు. సమిథలు సేకరిస్తూ ఒకరికొకరు కాస్త దూరమయ్యారు.

శివసేనుడు ఆదమరచి ఉండగా ఉన్నట్టుండి ఒక సింహం అడవి ప్రతిధ్వనించేలా గర్జించి అతనిమీదికి ఉరకబోయింది. శివసేనుడు వెంటనే ఒరనుంచి కత్తిదూసి సింహాన్ని ఎదుర్కొన్నాడు. దురదృష్టవశాత్తు సింహం పంజాదెబ్బకు కత్తి ఎగిరి దూరంగా పడి పోయింది. ప్రమాదం పసిగట్టిన శివసేనుడు పొదలను చాటు చేసుకుని అడ్డదిడ్డంగా పరిగెత్తసాగాడు.

సింహగర్జన విన్న బాణుడు ప్రమాదం వచ్చి ఉంటుందని శంకించి పరుగున అక్కడికి వచ్చాడు. పరుగు తీస్తున్న సింహాన్ని చూడగానే అమ్ముల పొదినుంచి బాణం తీసి గురి చూసి వదిలాడు. అది సూటిగా వెళ్ళి సింహం గుండెలో దిగబడింది. సింహం భయంకరంగా అరుస్తూ నేలపై బడి తన్నుకుంటూ ప్రాణాలు విడిచింది.

ఆ తరవాత బాణుడు చుట్టుపక్కల కలయజూసి, చెట్టుకొమ్మపైకి ఎక్కిన శివసేనుణ్ణి, ''మిత్రమా, భయపడకు. సింహం చచ్చింది. కిందికి దిగిరా,'' అన్నాడు.





చెట్టు పైనుంచి కిందికి వచ్చిన శివసేనుడు, సింహం బారినుంచి తనను కాపాడిన బాణుడికి కృతజ్ఞతలు చెప్పకపోగా, అతడు ప్రాణాపదలో ఉన్న తనను కాపాడడం చిన్నతనంగా భావించాడు.

అయితే, బాణుడు తాను రాజకుమారుణ్ణి కాపాడిన సంగతి ఎవరికీ చెప్పలేదు. దాని గురించి అక్కడే మరిచిపోయాడు. చివరికి గురువుతో కూడా ప్రస్తావించలేదు. అయితే శివసేనుడు మాత్రం ఏదో చెప్పుకోలేని అవమానం జరిగిపోయినట్టు మథనపడసాగాడు.

మరికొన్నాళ్ళకు ఇద్దరూ యౌవనవంతులై విద్యాభ్యాసం పూర్తి చేసుకుని స్వస్థలాలు చేరుకున్నారు.

ఒక శుభముహూర్తాన శూరసేనుడు తన కుమారుడైన శివసేనుడికి యౌవరాజ్యాభిషేకం జరిపించాడు. శివసేనుడు తన పట్టాభిషేక మహోత్సవం గురించి సహాధ్యాయి అయిన బాణుడికి మాటమాత్రంగానైనా కబురు పంపలేదు. బాణుడు దాన్ని పెద్దగా పట్టించుకోలేదు.

ఆ తరవాత కొన్ని రోజులకే రత్నగిరి రాజు ధీరదత్తుడు తన కుమార్తె దీప్తిచందనకు స్వయంవరం ప్రకటించాడు. స్వయంవరానికి రాజకుమారులే కాకుండా విలువిద్యలో నేర్పరులైన వీరకుమారులు ఎవరైనా రావచ్చునని చాటింపు వేయించాడు.

దీప్తిచందన అద్భుత సౌందర్యరాశి అని తెలిసిన రాజకుమారులు ఎందరో స్వయంవరానికి విచ్చేశారు. తమ అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి విలువిద్యలో ఆరితేరిన ఉత్సాహవంతులైన సామాన్య యువకులు కూడా కొందరు వచ్చారు. అలా వచ్చిన వారిలో బాణుడు కూడా ఉన్నాడు.

స్వయంవరానికి వచ్చిన శివసేనుణ్ణి చూడగానే బాణుడు, "మిత్రమా, కుశలమా?" అని ఆప్యాయంగా పలకరించాడు. అయితే, శివసేనుడు ముక్తసరిగా బదులుపలికి ముభావంగా ఉండిపోయాడు.

రాజు ధీరదత్తుడు, "సభలో అమర్చిన మత్స్య యంత్రాన్ని ఛేదించిన వీరుడికి నా కుమార్తెనిచ్చి వివాహం చేస్తాను," అని ప్రకటించాడు.

ఆ ప్రకటన విన్న శివసేనుడు తనకంటే ముందు వరుసలో ఉన్న బాణుణ్ణి చూసి, వాడి విలువిద్యాకౌశలం ఎరిగినవాడు గనక,

మనసులో అసూయాద్వేషాలతో విలవిలలాడి పోయాడు.

చాలా మంది రాజకుమారులు మత్స్య యంత్రాన్ని ఛేదించడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. బాణుడి వంతు రాగానే శివసేనుడు అపరిమితమైన ఉద్విగ్నతకు లోనయ్యాడు. అయితే, చిత్రంగా బాణుడి గురి తప్పింది. దానిని చూసి శివసేనుడు పరమానందం చెందాడు.

మరి కొంతసేపటికి శివసేనుడి వంతు వచ్చింది. అతడు గురి తప్పకుండా మత్స్య యంత్రాన్ని ఛేదించాడు. అందరూ కరతాళ ధ్వనులు చేశారు. దీప్తి చందన పరమానందంతో శివసేనుడి మెడలో వరమాల వేసింది.



శివసేనుడు సభామంటపం నుంచి వెలుపలికి వెళుతూ తారసపడిన బాణుణ్ణి దగ్గరికి పిలిచి, ''మత్స్య యంత్రాన్ని ఛేదించడం అన్నది అడవిలో తిరుగాడే కుందేలు పిల్లలను వేటాడేంత సులభం కాదు కదా,'' అన్నాడు హేళనగా.

ఆ మాటకు బాణుడు చిన్నగా నవ్వి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

రత్నగిరి రాజు ధీరదత్తుడు తనకు మగ సంతానం లేనందున తన కుమార్తెతో పాటు రత్నగిరి రాజ్యాన్ని కూడా శివసేనుడికి అప్పగించాడు. వివాహానంతరం శివసేనుడు చందనదీప్తితో సహా తన రాజ్యం చేరాడు.

రాజధానిని చేరగానే తండ్రికి స్వయంవర విశేషాలు వివరిస్తూ బాణుణ్ణి గురించి కూడా చెప్పాడు. అతణ్ణి గురించి వినగానే, ''ఎవరూ, ఆ బాణుడు గురుకులంలో నీ సహాధ్యాయి కదూ? అతణ్ణి చులకన చేసి మాట్లాడి తప్పు చేశావు,'' అని మందలించాడు తండ్రి.

పక్షం రోజుల తరవాత జరిగిన విజయ దశమి ఉత్సవాల సందర్భంగా శూరసేనుడు బాణుణ్ణి రాజధానికి ఆహ్వానించి, గురితప్పని విలుకాడు అన్న బిరుదంతో ఘనంగా సత్కరించాడు.

దానిని చూసి ఆశ్చర్యచకితుడై దీర్ఘాలోచనలో పడ్డ శివసేనుడు ఉన్నట్టుండి సింహాసనం నుంచి లేచాడు. బాణుడి దగ్గరకు వెళ్ళి నిండు సభలో అతణ్ణి కౌగిలించుకుని, ''మిత్రమా! నీకు అభ్యంతరం లేదంటే ఈ క్షణమే నిన్ను రత్నగిరికి నా ప్రతినిధిగా నియమిస్తున్నాను. నా కోరికను కాదనవు కదా?'' అన్నాడు.

బాణుడు మిత్రుడి కోరికను సంతోషంగా మన్నించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''మత్స్యయంత్రాన్ని ఛేదించలేకపోయిన బాణుణ్ణి శూరసేనుడు పనిగట్టుకుని రాజధానికి ఆహ్వానించి బిరుదంతో ఎందుకు సత్కరించాడు? తొలి నుంచీ బాణుడి పట్ల అసూయతో దహించుకుపోతూ, పదిమందిలో అతణ్ణి హీనంగా ఈసడించిన శివసేనుడు హఠాత్తుగా రత్నగిరి రాజ్యానికి తన ప్రతినిధిగా ఎందుకు నియమించాడు? తండ్రీకొడుకుల ఈ అనాలోచిత తొందరపాటు చర్యలకు అసలు కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తలపగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''విలువిద్యలో ఎప్పుడూ శివసేనుడికంటే ముందుండే బాణుడు మత్స్యయంత్రాన్ని ఛేదించలేకపోయినందుకు కారణం అతడు ఉద్దేశపూర్వకంగా గురి తప్పించడమే. బాల్యమిత్రుణ్ణి గెలిపించడానికే అతడు ఓడిపోయాడు. మిత్రుడి కోసం, అద్భుత సౌందర్యరాశి అయిన రాకుమార్తెనూ, రాజ్యాన్నీ వద్దనుకోవడం అతడిలోని త్యాగబుద్ధికీ, స్నేహ పాత్రతకూ నిదర్శనం. ఆ సంగతి అర్థం చేసుకున్నాడు గనకే శూరసేనుడు అతణ్ణి ఆహ్వానించి సన్మానించాడు. తండ్రి మందలింపుతో, న్యాయమైన ఉదాత్త చర్యతో శివసేనుణ్ణి అన్నాళ్ళు పట్టి పీడించిన అసూయాగ్రస్త ఆలోచనలు సమసిపోయాయి. బాల్యస్నేహితుడి మంచి మనసును ఆలస్యంగానైనా అర్థం చేసుకోగలిగాడు. రాజోచిత విద్యలు అభ్యసించి అన్ని విధాలా అర్హతను సాధించిన అతణ్ణి, తనకు అదనంగా కలిసివచ్చిన రాజ్యానికి తన ప్రతినిధిగా నియమించాడు. తండ్రీకొడుకుల చర్యలలో విజ్ఞత, వితరణ తప్ప ఎలాంటి అసంబద్ధతా, తొందరపాటూ కనిపించదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం : ఎస్. శివనాగేశ్వరరావు రచన]*








థార్విక్ సాల్గాజ్ అడవుల్లో ఆర్య మీదికి దాడి చేశాడు. హఠాత్తుగా ఏదో అడ్డుకున్నది...
















ఇది ఆడ తోడేలై ఉంటుందా?
చాలు! నీకేం కావాలి?
నాకు కావలసిందే మన ఇరువురికీ కావాలి థార్విక్!
నీకు నా పేరు తెలుసా?
సరిదిద్దుకో. నాకు మీ పేర్లు తెలుసు.


నేను తప్పక చేయవలసిన పని ఒకటి ఉన్నది!
నువ్వొక వేటాడే మృగానివి కూడా. నువ్వు చెయ్యవలసింది చెయ్.
రాజా, మమ్మల్ని వదిలిపెట్టు. దగ్గరుండి చూడడానికి యుద్ధ సమయం అనువైనది కాదు.
నేను వదిలిపెట్టను!
ధైర్యం, మూర్ఖత్వం ఇంచుమించు ఒకటే.



ఆడతోడేలు మాటలు బాధ కలిగించినప్పటికీ, ఆర్య వాటిని ఆలకించాలనే నిర్ణయించాడు.




నీ కోరలు చూస్తుంటే భయం లేదు. నీ అరుపులు వింటూంటే భయం లేదు.

...అయితే నీ కళ్ళల్లోకి చూస్తే మాత్రం నన్ను నేనే చూస్తున్నాను. భయంగా ఉంటోంది.




(ఇంకావుంది)



# రామాయణం

## యుద్ధ కాండ-8

కుంభకర్ణుణ్ణి గురించి విభీషణుడు రాముడితో ఇంకా ఈ విధంగా చెప్పాడు:

కుంభకర్ణుడు పుడుతూనే ఆకలివేసి మనుషులను వేల సంఖ్యలో తినసాగాడు. ప్రజలు బెదిరిపోయి ఇంద్రుణ్ణి శరణు జొచ్చారు.

ఇంద్రుడు ప్రజలను వెంటబెట్టుకుని బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి, కుంభకర్ణుడు ప్రజలను తింటున్నాడనీ, దేవతలను అవమానిస్తున్నాడనీ, ఆశ్రమాలను ధ్వంసం చేస్తున్నాడనీ, పరస్త్రీలను హరిస్తున్నాడనీ బ్రహ్మతో చెప్పాడు.

బ్రహ్మ రాక్షసులనందరినీ పిలిపించి, వారిలో కుంభకర్ణుణ్ణి చూశాడు. ఆయన కుంభకర్ణుడితో, ''విశ్రవసుడు నిన్ను కన్నది ప్రజాక్షయం చెయ్యటానికిలాగా ఉందేమిరా! ఇది మొదలు నువ్వు ఒళ్ళు తెలియకుండా పడి నిద్రపోతూ ఉండు,'' అన్నాడు. కుంభకర్ణుడు బ్రహ్మ ఎదటనే నిద్రముంచుకొచ్చి పడిపోయాడు.

అది చూసి రావణుడు, ''తాతా, నీ ముని మనమణ్ణి ఇలా శపించటం అన్యాయం. వీడి నిద్రకూ, మెలకువకూ నిర్దిష్ట కాలనియమం తగిన ఏర్పాటు చెయ్యి,'' అన్నాడు.

''వీడు ఆరు మాసాల పాటు నిద్రపోయి ఒకరోజు మేలుకుని ఉంటాడు,'' అన్నాడు బ్రహ్మ.

విభీషణుడు రాముడికి ఈ విషయాలు చెప్పి, ''రామా, నీ దెబ్బకు రావణుడు బెదిరిపోయి నిద్రపోతున్న కుంభకర్ణుణ్ణి లేపాడు. అతణ్ణి చూసే బెదిరి పారిపోయే వానరులు అతనికి యుద్ధంలో ఎదురునిల్చి ఏం పోరాడ





గలరు? అందుచేత వానరులతో మనం ఇదొక నడిచే యంత్రమని చెప్పాలి,'' అని చెప్పాడు.

ఈలోపల కుంభకర్ణుడు రావణుడి ఇంటికి వెళ్ళి, పుష్పకంలో విచారంగా కూర్చుని ఉన్న తన అన్నను చూశాడు. కుంభకర్ణుణ్ణి చూడ గానే రావణుడు సంతోషంతో లేచి వెళ్ళి కౌగి లించుకున్నాడు. కుంభకర్ణుడు అన్నగారి పాదాలకు నమస్కరించి, ''నన్ను నిద్రలేపిన కారణమేమిటి? ఏం భయం వచ్చి పడింది? ఎవరికి చావు మూడింది?'' అని అడిగాడు.

''నువ్వు చాలా కాలంగా సుఖ నిద్రలో మునిగి ఉన్నందున, రాముడు నాకు తెచ్చి పెట్టిన భయం గురించి నీకు తెలీదు. రాముడు సుగ్రీవుడి సేనతో సహా సముద్రాన్ని దాటివచ్చి మన అంతు కనుక్కుంటున్నాడు. లంకలో ఉండే వనాలూ, ఉపవనాలూ చూడు; అన్నీ వానరమయం. మన రాక్షస ముఖ్యులనందరినీ వానరులు చంపేస్తున్నారు. వానర ముఖ్యులు మన చేతిలో చావటం కనబడదు. నువ్వు మహాబలుడివి, ఈ ఆపద నుంచి కాపాడుతా వని నిద్రలేపాం,'' అని రావణుడు కుంభకర్ణు డితో అన్నాడు. కుంభకర్ణుడు నవ్వాడు.

''వెనక ఈ విషయం చర్చించుకున్నప్పుడు నీ హితం కోరినవారు ఏ ప్రమాదం వస్తుందని చెప్పారో అదే వచ్చిందన్నమాట! ముందువెన కలు ఆలోచించుకోకుండా బలగర్వంతో సీతను అపహరించి తెచ్చావు. మన తమ్ముడు విభీషణుడు చెప్పినట్టు చెయ్యి,'' అన్నాడు.

రావణుడీ మాటలు విని అలిగి, ''నువ్వు చిన్నవాడివి; నేను పెద్దవాణ్ణి. నాకు నువ్వు బుద్ధులు చెప్పటం వట్టి కంఠశోష. జరిగి పోయినదాన్ని గురించి ఇప్పుడు చర్చ దేనికి? ప్రస్తుత కర్తవ్యం ఆలోచించు. నేను చేసిన తప్పును నీ శౌర్యంతో సరిదిద్దు,'' అన్నాడు.

రావణుడికి కోపం వచ్చిందని గ్రహించి కుంభకర్ణుడు మృదువుగానూ, ఊరడింపు గానూ ఇలా అన్నాడు: ''బాధపడకు! కోప్ప డకు! నీకు తమ్ముణ్ణి, హితుణ్ణి కనక నీకు చెప్పవలసిన మాట చెప్పాను. యుద్ధంలో రామలక్ష్మణులను చంపేసి నీ కోరిక తీరు స్తాను. రాముడి తల తెచ్చి నీ ముందు పెట్టి నిన్ను సంతోషపెడతాను. నేను బతికి ఉండగా నీకు రాముడి భయం ఎందుకుంటుంది? నన్ను యుద్ధానికి పంపించు. నాకసలు ఆయుధాలతో పనిలేదు, ఉత్త చేతులతోనే ఎంతటి యోధులనైనా చంపెయ్యగలను.''

కుంభకర్ణుడి ఈ మాటలు విని మహోదరుడు మండిపడి, ''నువ్వు మొరటు మనిషివి, అల్పబుద్ధివి, అహంకారివి! రావణుడు చెయ్యగూడని పని ఎందుకు చేస్తాడు? చెడ్డ పని చేసినందువల్ల దుష్ఫలితం కలిగినట్టు చెప్పావే, అలా అనటానికి ప్రమాణమేమిటి? మంచి పనుల వల్ల దుఃఖమూ, చెడ్డ పనుల వల్ల సుఖమూ కలగటం లేదా? సీతను అపహరించాలని రావణుడికి కోరిక పుట్టింది. ఆ కోరికను మేము కూడా బలపరిచాం. అది అలా ఉంచు. నువ్వొక్కడవే యుద్ధానికి పోతానంటున్నావే! జనస్థానంలో అంత మంది రాక్షస వీరులను చంపిన రాముణ్ణి నువ్వొక్కడవే చంపగలవా?'' అన్నాడు.

తానూ, ద్విజిహ్వుడూ, సంహ్రాదీ, కుంభకర్ణుడూ, వితర్దనుడూ అనే ఐదుగురూ వెళ్ళి రాముణ్ణి చంపాలని మహోదరుడు సూచించాడు. రాముడు చచ్చాడా సరేసరి, ఒక వేళ అతను చావకపోయినా ఈ ఐదుగురూ యుద్ధ రంగంలో తిన్న గాయాలతో, రక్త ప్రవాహాలతో తిరిగి వచ్చి, రావణుడితో, 'మేము రామ లక్ష్మణులను తినేశాం!'' అని చెబుతారు. అప్పుడు రావణుడు సీతను ఓదార్చి, ధనకనక వస్తువాహనాలిచ్చి ఆమె మనసును వశ్యం చేసుకుంటాడు. రావణుడు యుద్ధానికి వెళ్ళి రాముణ్ణి ఎదుర్కోవలిసిన పని లేకుండానే సీత అతని వశమవుతుంది! ఇదీ మహోదరుడు చెప్పిన ఉపాయం.

అంతా విని కుంభకర్ణుడు, ''ఇలాంటి మాటలెన్నడూ చెప్పకు. ఒళ్ళు జాగ్రత్తగా



పెట్టుకో!'' అని మహోదరుణ్ణి హెచ్చరించాడు. అతడివంటి వాళ్ళ సలహాలు వినే రావణుడికి ఈ గతి పట్టిందన్నాడు.

రావణుడు గట్టిగా నవ్వి, ''మహోదరుడికి రాముడంటే భయంలే! అందుచేత యుద్ధానికి పోవద్దంటున్నాడు. నువ్వెళ్ళి యుద్ధం చేసి జయించిరా. వెళ్ళి, రామలక్ష్మణులనూ, వానరులనూ భక్షించు,'' అన్నాడు.

కుంభకర్ణుడు ఒక అపూర్వమైన శూలాన్ని తీసుకున్నాడు. అది బోలెడంత ఇనుము ఉపయోగించి చేసినది, బంగారు అలంకారాలు గలది, ఎర్రని పూలమాలికలు చుట్టినది, ఇంద్రుడి వజ్రాయుధానికి తీసిపోనిది. ఆ శూలం మాత్రం తీసుకుని, తాను ఒక్కడే యుద్ధానికి పోతాననీ, తనకు సహాయంగా సేన అవసరంలేదనీ కుంభకర్ణుడు చెప్పాడు.



రావణుడు అతనితో సైన్యాన్నీ ఆయుధాలనూ తీసుకుపొమ్మనీ, యుద్ధంలో ఏమరుపాటుగా ఉన్నవాడికీ, ఒంటరిగాడికీ ప్రమాదం హెచ్చనీ అన్నాడు. అతను తన తమ్ముడి మెడలో రత్నఖచితమైన బంగారుహారం వేశాడు, ఆభరణాలు పెట్టాడు. మంచి సువాసన గల పుష్పమాలలు వేశాడు. చెవులకు కుండలాలు పెట్టాడు, ఎంతో బరువైన బంగారు కవచం తొడిగాడు.

కుంభకర్ణుడు అన్నను ఆప్యాయంగా కౌగిలించుకుని, అతని చుట్టూ ప్రదక్షిణం చేసి, భక్తితో సాష్టాంగ నమస్కారం చేసి ఆవేశంతో యుద్ధానికి బయలుదేరాడు. అతని వెనకగా మహాబలశాలులైన రాక్షస వీరులూ, పెద్దసేనా ఆయుధాలు ధరించి బయలుదేరారు.

కుంభకర్ణుణ్ణి చూసి పారిపోతున్న వానర వీరులలో నలుడూ, నీలుడూ, గవాక్షుడూ, కుముదుడూ లాంటి వానరముఖ్యులున్నారు. అంగదుడు వారిని చూసి, ''మీరు మీ ఆత్మగౌరవాన్నీ, పరాక్రమాన్నీ కూడా మరిచి, చచ్చుకోతుల్లాగా బెదిరిపోయి ఎక్కడి కలా పారిపోతున్నారు? ఆ వచ్చేది యుద్ధం చేసే రాక్షసుడు కాదు, విభీషిక-భయం పుట్టించే బొమ్మ. వెనక్కు రండి, ఈ వెరబొమ్మను ధ్వంసం చేద్దాం,'' అన్నాడు.

ఆ మాటలతో ధైర్యం తెచ్చుకుని వానరులు వెనక్కు తిరిగివచ్చి కుంభకర్ణుడిపై తలపడ్డారు. వాళ్ళు తనపై విసిరిన కొండ రాళ్ళకూ, చెట్లకూ కుంభకర్ణుడేమాత్రమూ చలించ లేదు. వానరులను నిర్మూలించ సాగాడు.

ఆ దెబ్బతో వానరులు పరుగు లంకించుకున్నారు. కొందరు ఆకాశంలోకి ఎగిరారు. కొందరు వెళ్ళి సముద్రంలో పడ్డారు. భల్లూకాలు కొందరు చెట్లలోనూ, మరికొందరు కొండలలోనూ దాక్కున్నారు. కొందరు చచ్చినట్టు కదలకుండా పడుకున్నారు.

''ఆగండి! ఆగండి! వెనక్కు రండి!'' అని అంగదుడు కేకపెట్టి వానరులను పిలిచాడు. యోధులైనవాళ్ళు శత్రువును చంపి కీర్తి గడించటమో, శత్రువు చేతిలో చచ్చి బ్రహ్మలోకానికి పోవటమో చెయ్యాలిగాని, ప్రాణాలు కాపాడుకోవడానికి పిరికిపందల్లాగా పారిపోరాదనీ, కుంభకర్ణుడికి రాముడి చేతిలో నిశ్చయంగా చావు మూడిందనీ అతను వాన

రులతో అన్నాడు. కాని వాళ్ళు, ''కుంభకర్ణుడు మమ్మల్ని దారుణంగా చంపేస్తున్నాడు. మేము పోతాం. మాకు ప్రాణాలు దక్కితే చాలు,'' అని, కుంభకర్ణుడు వస్తూండటం చూసి పారిపోయారు. అయితే అలా పారిపోయే వానరులను అంగదుడూ, హనుమంతుడూ కలిసి మంచి మాటలతో నచ్చచెప్పి ఎలాగో వెనక్కు మరలించగలిగారు.

తరవాత హనుమంతుడు పన్నెండు మంది వానరయోధులను వెంటబెట్టుకుని యుద్ధానికి బయలుదేరాడు.

వీరంతా ఏకంగా చేసిన యుద్ధంలో అనేక మంది రాక్షసులు చచ్చారు, రథాలు నుగ్గయ్యాయి, ఏనుగులూ, గుర్రాలూ, ఒంటెలూ చచ్చాయి. హనుమంతుడు గాలిలోకి ఎగిరి కుంభకర్ణుడి పైన కొండరాళ్ళ వర్షం కురిపించాడు, వృక్షాలు వేశాడు. కుంభకర్ణుడు వాటినన్నిటినీ తన శూలంతో పక్కకు నెట్టేశాడు. కుంభకర్ణుడు వానరులను తరుముతూ పోతూంటే హనుమంతుడొక పర్వతశిఖరం పట్టుకుని అతనికి అడ్డంగా నిలబడ్డాడు. దాన్ని పెట్టి హనుమంతుడు కొట్టేసరికి కుంభకర్ణుడికి తలపగిలి, శరీరం రక్తంతో తడిసింది. వెంటనే కుంభకర్ణుడు తన శూలంతో రొమ్ములో పొడిచే సరికి, హనుమంతుడు నోట నెత్తురు కక్కుతూ మూర్ఛపోయాడు. హనుమంతుడు పడగానే మళ్ళీ పారిపోసాగిన వానరులను నీలుడు నిలిపివేసి, కుంభకర్ణుడిపై ఒక పెద్ద కొండరాయి వేశాడు. కుంభకర్ణుడు దాన్ని పిడికిలితో పొడిచి చూర్ణం చేశాడు.




అది చూసి అనేక వేలమంది వానరులు కుంభకర్ణుడిపైన వచ్చి పడ్డారు. కుంభకర్ణుడు వాళ్ళను పట్టుకుని తినసాగాడు. వానరులలో హాహాకారాలు చెలరేగాయి.

అంగదుడు కుంభకర్ణుడి తలపైన పెద్ద కొండరాయి వేసి కొట్టాడు. కుంభకర్ణుడు మండిపడి శూలం విసిరితే అంగదుడు ఉపాయంగా తప్పించుకుని, చప్పున కుంభకర్ణుణ్ణి సమీపించి, రొమ్ముల్లో అదిరేటట్టుగా కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడికి మూర్ఛ వచ్చింది. వెంటనే స్పృహ తెచ్చుకుని కుంభకర్ణుడు అంగదుణ్ణి ఎడమచేతి పిడికిలితో పొడిచి మూర్ఛ పోగొట్టి, శూలాన్ని ఎత్తుకుని సుగ్రీవుడి పైకి వెళ్ళాడు.

కుంభకర్ణుడు తన శూలాన్ని గిరగిరా తిప్పి సుగ్రీవుడిపైన విసిరాడు. అంతలో హను

రామాయణం క్విజ్ జూన్ 2009
సరైన సమాధానం: C
విజేత: ఎం.వి.ఎల్.కె. భరద్వాజ్
విశాఖపట్నం-530 003

మంతుడు వచ్చి మధ్య దారిలో దాన్ని పట్టుకుని, రెండు చేతులా పట్టి విరిచి పారేశాడు.

శూలం పోయేసరికి కుంభకర్ణుడు కోపించి ఒక రాయి విసిరి సుగ్రీవుణ్ణి మూర్ఛపోగొట్టాడు. మూర్ఛలో ఉన్న సుగ్రీవుణ్ణి కుంభకర్ణుడు పట్టుకుని ఎత్తుకుపోయాడు. సుగ్రీవుణ్ణి కాజేస్తే వానరసేనా, రామలక్ష్మణులూ నిర్వీర్యులయిపోతారని అతని ఉద్దేశం. అతను సుగ్రీవుణ్ణి తీసుకుని లంకకు వెళ్ళిపోయాడు. కుంభకర్ణుణ్ణి ఎదిరించి సుగ్రీవుణ్ణి విడిపించుదామా అని హనుమంతుడొక క్షణం పాటు ఆలోచించి, చివరకు అలా చేయటం అనవసరమని తేల్చుకున్నాడు. ఎందుచేతనంటే, స్పృహ తెలిసిన మరుక్షణం అతను తనను తానే విడిపించుకోగలడు.

లంకా పౌరులు కుంభకర్ణుడిపై చల్లిన సుగంధ జలాలతో సుగ్రీవుడికిస్పృహ వచ్చింది. తానిప్పుడు ఏవిధమైన ప్రతిక్రియ చేస్తే బాగుంటుందా అని అతను ఆలోచించాడు. చివరకతను తన గోళ్ళతో కుంభకర్ణుడి చెవులు గిల్లి, ముక్కూ, చెంపలూ కొరికేశాడు. కుంభకర్ణుడు అలిగి సుగ్రీవుణ్ణి నేలకేసి కొట్టి తొక్కాడు. అయినా సుగ్రీవుడు లక్ష్యపెట్టక వాయువేగంతో గాలిలోకి లేచి రాముడున్న చోట వాలాడు.

## చందమామ రామాయణం క్విజ్

కుంభకర్ణుడు సుగ్రీవుడిపై విసిరిన శూలాన్ని పట్టుకుని విరిచిన వానర వీరుడు ఎవరు?

a. అంగదుడు b. శరభుడు
c. హనుమంతుడు

మీ సమాధానాన్ని CRQ <a/b/c> <space> <Name, Lang, Place> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఒక అదృష్ట విజేతకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.








## జపాను జానపద కథ

# బొమ్మ చేసిన మేలు!

ఒక గ్రామంలో పేద రైతుదంపతులు ఉండేవారు. వారికి ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. పెద్ద కొడుకు, ఇద్దరు కూతుళ్ళు తల్లిదండ్రులకు పొలం పనులలోనూ, ఇంటి పనులలోనూ సాయపడేవారు. చిన్నవాడు జోజీ కూడా తండ్రితో, అన్నలతో కలిసి పొలం వద్దకు వెళ్ళేవాడేగానీ ఒళ్ళొంచి పనిచేసేవాడు కాదు. వాడికి బొమ్మలు గీయడం అంటే మహా ఇష్టం. అదీ పిల్లి బొమ్మలు మాత్రమే గీసేవాడు. పుల్లను తీసుకుని చిన్న పిల్లులు, పెద్ద పిల్లులు, ఆడుకునే పిల్లులు, అరిచే పిల్లులు, కోపంతో ఉరికే పిల్లులు అంటూ రకరకాల పిల్లుల బొమ్మలు దీక్షగా గీస్తూ కూర్చునేవాడు.

''ఇలా పొద్దస్తమానం పిల్లుల బొమ్మలు గీస్తూ కూర్చుంటే పొలం పనులు ఎప్పుడు నేర్చుకుంటావు?'' అని తండ్రి తరచూ మందలించేవాడు. అయినా జోజీ తండ్రి మాటలను చెవిన వేసుకోకుండా బొమ్మలు గీస్తూండేవాడు.

జోజీ తల్లిదండ్రులు అతడి భవిష్యత్తును గురించి తీవ్రంగా ఆలోచించారు. ''జోజీ ఎన్నటికీ ఇక మంచి రైతు కాలేడు,'' అన్నాడు తండ్రి విచారంగా.

''పొలం పనుల పట్ల ఆసక్తి లేదేగాని, జోజీ చాలా తెలివైనవాడు. వాణ్ణి పూజారి వద్ద సహాయకుడిగా చేర్పిద్దాం. పూజారి వృద్ధుడైపోయాడు గనక, సహాయకుడు వస్తే సంతోషించగలడు. జోజీ ఆ పనులను త్వరలో నేర్చుకోగలడనుకుంటాను,'' అన్నది తల్లి.

తండ్రికి కూడా అది సరైన ఆలోచనగానే తోచింది. భార్యా భర్తలిరువురూ జోజీని పూజారి వద్దకు తీసుకువెళ్ళి సంగతి చెప్పారు. పూజారి జోజీని పరీక్షించి చాలా తెలివైనవాడనీ, ఊహా శక్తి కలవాడనీ గ్రహించాడు.

''వినయవిధేయతలతో నేను చెప్పినట్టు నడుచుకున్నట్టయితే, జోజీకి సంతోషంగా పూజా విధానం నేర్పుతాను,'' అన్నాడు ఆయన.

జోజీ అందుకు అంగీకరించి, పూజారి దగ్గరే ఉండిపోయాడు.

అతడక్కడ ఒక కుంచె, ఒక రాయి, ఒక





సిరాపుల్ల అంటూ రాత పరికరాలను సమకూ ర్చుకున్నాడు. సిరా తయారు చేయాలనుకు న్నాడు. రాతి రంధ్రంలో నీళ్ళుపోసి సిరాపుల్లతో వేగంగా రుద్దసాగాడు. కొంత సేపటికి సిరా సిద్ధమయింది. కుంచెను సిరాలో ముంచి గడ్డి కాగితం మీద రాయడం అద్భుతమనిపించింది. రాయడం కన్నా, కాగితాల మీద పిల్లి బొమ్మలు గీయడం అతనికి అమితానందం కలిగించింది!

పూజారికి అది సుతరామూ నచ్చలేదు. ''జోజీ, పిల్లుల బొమ్మలు గీస్తూ సమయం వృథా చేస్తూంటే ఆలయం పనులు నేర్చుకుని పూజారివి ఎప్పుడవుతావు?'' అనేవాడు తరచూ. అయినా జోజీ ఆలయంలోని తెరల మీద, అద్దాల మీద, తిరిగిన ప్రతి చోటా రకరకాల పిల్లుల బొమ్మలు గీయడం మొదలుపెట్టాడు.

ఒకనాడు పూజారి జోజీని దగ్గరికి పిలిచి, ''జోజీ, పిల్లులను గురించి తప్ప నువ్వు మరేదీ ఆలోచించలేకుండా ఉన్నావు. పూజారివి కావడానికి అది నీకు ఎన్నటికీ ఉపయోగపడదు. పెద్ద అవరోధం కూడానూ. నువ్వు ఇంటికి తిరిగి వెళ్ళిపోవడం మంచిదనుకుంటాను,'' అన్నాడు.

జోజీ విచారంగా తల పంకించి, తన సంచులను సిద్ధం చేసుకున్నాడు. పూజారి దగ్గర సెలవు తీసుకుని అక్కడి నుంచి బయలుదేరాడు.

పూజారి తనను పంపేశాడని తెలిస్తే తల్లిదండ్రులు ఆశాభంగానికిలోనై బాధపడగలరని జోజీకి తెలుసు. అక్కడికి కొంత దూరంలో మరో గుడి ఉంది గనక, అక్కడి పూజారికి సహాయకుడిగా చేరవచ్చున్న ఆశతో అటుకేసి నడవసాగాడు......

ఆ గుడిలోపల ఒక పెద్ద రాకాసి ఎలుక చేరి సృష్టిస్తూన్న నానా బీభత్సానికి భయపడి జనం ఎప్పుడో గుడిని వదిలిపెట్టేశారన్న విషయం జోజీకి తెలియదు.

జోజీ గుడిని సమీపించేసరికి బాగా పొద్దుపోయి రాత్రయింది. అతడు ద్వారం తెరుచుకుని గుడి మెట్ల వరకు వెళ్ళి తలుపు తట్టాడు. అయితే ఒక్కరూ తలుపు తెరవలేదు. ''వింతగా ఉందే! ఒక్కరూ లేరేమిటి?'' అని ఆశ్చర్యపోయాడు జోజీ. కొంతసేపు ఆలోచించి తలుపును బలంగా ముందుకు తోశాడు. కిర్రుమనే శబ్దంతో అది తెరుచుకున్నది. లోపల చిమ్మచీకటిగా ఉంది.

జోజీకి చిన్న దీపం కనిపించడంతో వెలిగించాడు. గుడి నిశ్శబ్దంగానూ, ఖాళీగానూ ఉన్నది. విశాలమైన గది చుట్టూ కాగితాల అట్టలు వేలాడుతూండడం చూసి జోజీ అమితానందంతో చేతులు చరుస్తూ ఎగిరి గంతేశాడు. వాటిని

అలా ఖాళీగా ఉంచడం చాలా అవమానంగా భావించాడు. వెంటనే కుంచె, సిరా వెలుపలికి తీసి చకచకా పిల్లుల బొమ్మలు గీయడంలో నిమగ్నుడయ్యాడు. ఆఖరికి ఒక్క అట్ట మాత్రమే మిగిలి ఉంది. దానిమీద ఒక బ్రహ్మాండమైన పిల్లి బొమ్మ గీశాడు. అతడు ఇన్నాళ్ళు గీసిన అన్నిటికన్నా అది చాలా పెద్దది; అమిత ఆగ్ర హంతో కనిపిస్తోంది. దాన్ని చూడగానే జోజీ మనసులో ఒక విధమైన తృప్తితో కూడిన ఆనందం పెల్లుబకసాగింది. తను గీసిన పిల్లి బొమ్మకేసి ఒకసారి గర్వంగా చూసుకున్నాడు. బాగా అలిసి పోవడంతో కనురెప్పలు భారంగా వాలిపోతు న్నాయి. అంత విశాలమైన గది వద్దని అతడు పక్కనున్న గదిలో ఒక బెంచీమీద పడుకుని ఆదమరచి నిద్రపోయాడు.

అర్ధరాత్రి సమయంలో జోజీ ఉలిక్కిపడి లేచాడు. భయంకరమైన శబ్దం. పక్కనున్న పెద్ద గదిలో పెద్ద మృగమేదో పోరాడుతున్నది. దరిదాపుల్లో మనుషులెవరూ లేరు. తను కూడా లేకుండా ఉంటే ఎంత బావుణ్ణు అనిపించింది ఒక్క క్షణం. ఆ తరవాత మళ్ళీ భయంకర శబ్దాలు ''యో... వ్... ఎస్‌స్‌స్‌స్...'' భీకర పోరాటం. ఆ తరవాత కొంత సేపటికి దభీమన్న శబ్దం. కాళ్ళు గింజుకుంటున్న ధ్వని.. ఆ తరువాత ఏమాత్రం అలికిడి లేని నిశ్శబ్దం. జోజీ లేచి అటుకేసి వెళ్ళడానికి సాహసించలేకపోయాడు.

తెల్లవారింది. సూర్యకిరణాలను చూడగానే జోజీలో ధైర్యం పుంజుకున్నది. విశాలమైన గదిలోకి తొంగి చూశాడు. అతి పెద్ద రాకాసి ఎలుక, దాదాపు ఆవు పరిమాణంలో నేలమీద చచ్చిపడి ఉన్నది. గదిలో పిల్లులచిత్రాలు గల తెరలు తప్ప మరేదీ కనిపించలేదు. బ్రహ్మాండ మైన పిల్లి బొమ్మకేసి చూసి, ''పిల్లి కుడివైపు చూస్తున్నట్టూ, తోక ఎడమవైపుకు ఉన్నట్టే కదా తను గీసింది? ఇప్పుడు మారిపోయిందేమిటి? పిల్లి నోట్లో ఎర్రటి మరక లేమిటి?'' అని విస్తు పోయాడు. ఆ తరవాత అసలు సంగతి తెలియ రావడంతో అతడి కళ్ళు సంతోషంతో విప్పారాయి. నమస్కరిస్తున్నట్టు కిందికి వంగి, ''ఓ పిల్లీ, ఆ రాకాసి ఎలుక నుంచి నువ్వు నన్ను కాపాడావు. నేను బతికున్నంత కాలం పిల్లుల బొమ్మలు తప్ప వేరే చిత్రాలు గీయను,'' అన్నాడు.

ఈ సంగతి గ్రామస్థులకు తెలియగానే జోజీ పెద్ద వీరుడైపోయాడు. ఆలయ పూజారి అతణ్ణి తన సహాయకుడిగా తీసుకోవాలనుకున్నాడు. అయితే, జోజీ పూజారి కాలేదు. గొప్ప చిత్రకారు డిగా పేరు తెచ్చుకున్నాడు.




జాతక కథలు
1


హిమాలయ పాదతలంలోని ఆశ్రమంలో పరమానందుడనే ముని నివసించేవాడు.


ఒకనాడు...
ఏమిటీ వింత! ఒక్క తామర మాత్రం మనోహరంగా అద్భుతంగా వికసించి ఉన్నది!


ముని ఆతురతకొద్దీ తామర పువ్వు వద్దకు ఈదుకుంటూ వెళ్ళాడు.


అందులో పసిబిడ్డ ఏడుపు విని అమితాశ్చర్యం చెందాడు!
Waah Waah!
?




తామర పుష్పంలో శిశువు! అద్భుతం! అద్భుతం!


ఆ ఆడ శిశువును పెంచాలని నిర్ణయించిన ముని, బిడ్డను ఆశ్రమానికి తీసుకువచ్చాడు. బిడ్డకు 'అశంక' అని పేరు పెట్టాడు.


ముని అశంకను అల్లారుముద్దుగా పెంచసాగాడు.


అశంక అపురూప సౌందర్యవతిగా పెరిగి పెద్దదయింది. ఒకనాడు...
ఆహా! ఎంతటి సౌందర్యరాశి!


ఆ రాజోద్యోగి రాజభవనానికి పరిగెత్తాడు.


రాజా! ఆ దివ్య సౌందర్యరాశిని మీరు తప్పక చూడాలి.
అలాగా! ఆమె పేరేమిటి?
(ఇంకావుంది)

# వేగ సూత్రం

ఈ నెల సమస్య:

రాము పళ్ళతోటలో 68 మామిడి చెట్లు ఉన్నాయి. 6 చెట్లలోని పళ్ళన్నింటినీ ఉడతలు తినేశాయి. 13 చెట్లలో ఒక కాయ కూడా కాయలేదు. మిగిలిన చెట్లలో ఒక్కొక్క చెట్టుకు 49 పళ్ళున్నాయి. రాము 10 పళ్ళు కోసుకుంటే తోటకు కాపలా కాసి సాయపడిన మిత్రుడు శ్యామ్‌కు 1 పండు ఇవ్వవలసి ఉంటుంది. మొత్తం మీద రాముకు ఎన్ని పళ్ళు వస్తాయి? ఈ లెక్కను అత్యంత వేగంగా లెక్కగట్టడానికి ఉపయోగపడే వేగసూత్రం ఏమిటి?

మీ వేగసూత్రాన్ని ఆగస్ట్ 31వ తేదీ లోగా మాకు పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ. 500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:
ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్- 600041.
లేదా contests@chandamama.com కు ఈ మెయిల్ చేయండి.

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం అక్టోబర్ సంచికలో ప్రచురించబడుతుంది.*

---

జూన్ నెల సమస్యకు సరైన సమాధానాలు రానందు వలన బహుమతి ఇవ్వలేకపోతున్నాము.

ఇదీ సరైన సమాధానం:

**స్టెప్ 1:** భవనంలో మనుషులున్న ఫ్లాట్స్= 9, పిల్లల సంఖ్య= 11 (7 ఫ్లాట్లలో ఒక్కొక్క పాపాయి; స్నేహ, రమేష్ ఫ్లాట్లలో ఇద్దరిద్దరు పిల్లలు ఉన్నారు. కాబట్టి 7 + 2 + 2 = 11)

**స్టెప్ 2:** ఒక పాపాయికి అయ్యే మొత్తం ఖర్చు = 70 + 25 + 3 = 98

**స్టెప్ 3:** ఆటకు అయ్యే మొత్తం ఖర్చు= 11 X 98. రెండంకెల సంఖ్యను 11తో గుణించవలసి వచ్చినప్పుడల్లా, ఈ వేదగణిత సూత్రాన్ని వాడవచ్చు:

1. ఒకటవ స్థానంలో ఉన్న దానిని కుడివైపునా, పదవ స్థానంలో ఉన్నదానిని ఎడమవైపునా రాసుకోవాలి. రెండు అంకెలకూ మధ్య లెక్కవేయడానికి కొంత ఖాళీ ఉంచాలి. 11 X 98ని 9 8అని రాసుకోవాలి.

2. ఇప్పుడు రెండు డిజిట్లనూ కూడిక చేసుకోవాలి. కలిపి వచ్చే మొత్తం ఒకే అంకెలో ఉన్నట్టయితే రెండు అంకెల మధ్యలో వేసుకోవాలి. అదే మీ ఆఖరి సమాధానం. ఉదాహరణకు, 34ను 11తో గుణించాలనుకుంటే 3+4 = 7, 7 ఒకే స్థానం సంఖ్య అలాంటప్పుడు మీ సమాధానం 374 అవుతుందన్నమాట. అయితే ఇక్కడ రెండు డిజిట్ల సంఖ్య వస్తోంది, అంటే 9+8=17. కాబట్టి ఫలితాన్ని ఇలా రాసుకోవాలి $9_1 78$.

3. ఒకటిని ఎడమవైపు ఉన్న అంకెతో కూడుకోవాలి, అంటే 1+9=10. (ఇప్పుడు మన సమాధానం 1078 అన్నమాట.)

ప్రయత్నించి చూడండి ఇది రెండు స్థానాలు గల సంఖ్యలన్నింటికీ వర్తిస్తుంది!

# యురేకా

## మీ ధర్మామీటర్ మీరే తయారు చేసుకోండి!



ఏ మేం కావాలి?

ప్లాస్టిక్ మూతతో పారదర్శకమైన ప్లాస్టిక్ లేదా గాజు బాటిల్, పారదర్శకమైన స్ట్రా, నీళ్ళు, ఫుడ్ కలర్, మార్కర్ పెన్, ప్లాస్టిసిన్ లేదా మోడలింగ్ క్లే.

తయారు చేయడం ఎలా?

- బాటిల్‌ను మూడువంతులు నీళ్ళతో నింపి కొన్ని చుక్కల ఫుడ్ కలర్ కలపండి.
- స్ట్రా వెళ్ళడానికి వీలుగా బాటిల్ ప్లాస్టిక్ మూతలో రంధ్రం చేయండి.
- బాటిల్‌కు మూతను గట్టిగా బిగించండి. మూతకు ఉన్న రంధ్రం గుండా స్ట్రాను లోపలికి చొప్పించండి. స్ట్రా బాటిల్ అడుగు భాగాన్ని తాకకుండా చూసుకోండి.
- ప్లాస్టిసిన్ లేదా మోడలింగ్ క్లేను ఉపయోగించి స్ట్రా చుట్టూ బిగువుగా సీల్ చెయ్యండి.
- స్ట్రాలో నీటి మట్టం తగ్గేవిధంగా స్ట్రా గుండా మెల్లగా ఊదండి. నీటి మట్టం తగ్గిందంటే మూత మీది సీల్ చాలినంత బిగువుగా లేదని అర్థం. చెక్ చేసుకుని జాగ్రత్త పడండి!
- మార్కర్ పెన్‌తో స్ట్రాలోని నీటిమట్టాన్ని గుర్తు పెట్టండి. ఇది మీ గది ఉష్ణోగ్రత స్థాయి అన్నమాట.
- ఇప్పుడు మీ ధర్మామీటర్‌ను ఎండలో పళ్ళెంలోని వెచ్చటి నీళ్ళ మధ్య గాని, ఫ్రిడ్జ్‌లో గాని ఉంచి నీటి మట్టాలను గుర్తుపెట్టండి. ఇలా చేయడం ద్వారా ఉష్ణోగ్రతల హెచ్చుతగ్గులను సులభంగా కనుగొనవచ్చు.

కాన్సెప్ట్: ఉష్ణోగ్రతలను బట్టి ద్రవపదార్థాలలో ఏర్పడే వ్యాకోచ, సంకోచాల సిద్ధాంతాన్ని అనుసరించి ధర్మామీటర్ పని చేస్తుంది. స్టాండర్డ్ ధర్మామీటర్లలో నీళ్ళకు బదులు పాదరసం ఉపయోగిస్తారు.

అమ్మ: ఎందుకే అరుంధతి ఏడుస్తోంది?
అంజన: నేను కేక్ ఇవ్వలా. అందుసే ఏడుస్తోంది.
అమ్మ: మరి దానికి నేనిచ్చిన ముక్క ఎక్కడికి పోయిందే?
అంజన: అయ్యో అమ్మా.. దాన్ని నేను లాక్కుని తింటున్నందుకే కదా ఈ ఏడుపు...



# చందమామ లోకజ్ఞానం క్విజ్-7

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 7 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఆగస్ట్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. సెప్టెంబర్ నెల సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## జంతు ప్రపంచం

1. పిల్లులకు సంబంధించిన ఒకానొక మూఢనమ్మకం యూరపులో బ్లాక్ ప్లేగ్ వ్యాప్తికి దోహదం చేసింది. ఆ మూఢనమ్మకం ఏది?
2. ప్రపంచంలోనే అత్యంత ప్రమాదకరమైన పది విష నాగులు ఒకే ఖండంలో ఉన్నాయి. ఆ ఖండం ఏది?
3. కోడి మాంసాన్ని పంది మాంసంతో కలిపి తినడం ఒక ప్రాంతంలో చట్టవిరుద్ధం. అది ఏ ప్రాంతం?
4. 'అలెక్టొరో ఫోబియా' అంటే ఏమిటి?
5. ప్రాకుడు జంతువులు లేని ఏకైక ఖండం ఏది?
6. ప్రపంచంలోని ఏ భాగంలో గుల్ల చేపలు చెట్లెక్కు తాయి?
7. టైటానిక్ మునిగిపోయినప్పుడు రెండు కుక్కలు కాపాడబడ్డాయి? అవి ఏ జాతి కుక్కలో తెలుసా?



*Courtesy:http//freedigitalphotos.net*

**చందమామ క్రిస్టల్ క్రికెట్ బాల్ మే'09 సమాధానాలు:**

1.డెక్కన్ చార్జర్స్ వర్సెస్ రాయల్ ఛాలెంజర్స్ 2.ఆడమ్ గిల్‌క్రిస్ట్ 3.ఎవరూ లేరు 4.ఎవరూ లేరు 5.మ్యాథ్యూ హేడెన్ 6.ఆర్.పి.సింగ్ 7.మోర్తాజా.

ఐపిఎల్ డ్రీమ్ XI టీమ్:

1.మ్యాథ్యూ హేడెన్ 2.ఆడమ్ గిల్‌క్రిస్ట్ 3.సురేష్ రైనా 4.తిలకరత్నే దిల్‌షాన్ 5.యువరాజ్ సింగ్ 6.రోహిత్ శర్మ 7.యూసఫ్ పఠాన్ 8.అనిల్ కుంబ్లే 9.ఆషిష్ నెహ్రా 10.ఆర్.పి.సింగ్ 11.లాసిత్ మాలింగా.

విజేత: నిరంజన్ వి భట్, సిర్సి

*గమనిక: 13 భాషల్లో చాలా ఆసక్తికరమైన ప్రెడిక్షన్స్ వచ్చాయి. ఒక ఎంట్రీ మాత్రమే 50 శాతం సరిగ్గా రాగలిగింది. కాబట్టి ఒక ల్యాప్‌టాప్ బహుమతిగా అందజేస్తున్నాం.*

సైబర్‌నెట్‌లో 15 లక్షల బ్లాక్ హోల్స్? వివరాలకు telugu.chandamama.com చూడండి

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు అక్టోబర్ 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041

## అభినందనలు

బి.వి.ఆర్.ఎస్.ఎస్.ఎస్. ప్రసాద్,
ఫ్లాట్ నం.302, ఎంవీఎస్ మ్యాన్షన్స్,
ఆపోసిట్. డిస్ట్రిక్ట్ లైబ్రరీ,
మహారాణి పేట,
విశాఖపట్నం-530 002.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





కష్టపడి చదవాలి!
ఇష్టపడి తినాలి!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-5 జూన్ 2009 సమాధానాలు

1. 1886, జర్మనీ 2. ప్రీమియర్ పద్మిని 3. హిందూస్థాన్10 హిందూస్థాన్ మోటార్స్ తయారు చేసినది 4. మారుతి-సుజుకి 5. బుగ్గట్టీరాయల్ కెల్నర్ కూప్, 1987లో 4.87మిలియన్ పౌండ్స్‌కు విక్రయించబడింది. 6. అల్టిమేట్ ఏరో తయారు చేసిన షెల్బీ సూపర్ కార్స్, గంటకు 257 మైళ్ళు 7. హన్స్ తోల్‌స్ట్రప్; ల్యారీ పెర్కిన్స్ 8. గుజరాత్ టాటా మోటార్స్ సనంద్ ప్లాంట్

గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.

## రూపాంతరం

*[ "చాలు, పిచ్చాపాటీ. ఇక బయలుదేరుదాం," అన్నాడు ఓమెన్ దృఢమైన కంఠస్వరంతో. ఒక్క కుదుపుతో నౌక మెల్లగా అనునిర్వకేసి కదలసాగింది. ]*

తాతయ్య, లడ్డూల దగ్గర నేను నిలబడ్డాను. లెమన్, ఓమెన్‌మాతో చాలా చనువుగా ఉన్నారు గానీ, మునుముందు ఈ ఓడలో మాకేం జరుగుతుందో ఎవరికి తెలుసు?

"ఇక్కడ ఇంకా ఎవరెవరున్నారు?" అని ఓమెన్‌ను అడిగాడు తాతయ్య ఎవరో అడగమన్నట్టు.

"రెండు డైనోజార్లు... ఒకరినొకరు మింగేయకుండా ప్రశాంతంగా ఉండమని మేమెంత హెచ్చరించినా వర్తమానాన్ని చూడాలని పట్టుబట్టి మరీ వచ్చాయి. ఇంకా ఊహాలోకాల్లో విహరిస్తూ చీటికిమాటికి ఉద్వేగం పెంచుకునే ఒకసీసిక్ చీనా ఏనుగు, ఒక క్వగ్గా ఉన్నాయి," అని జాబితా విప్పాడు ఓమెన్.



"ఒక బొద్దింక కూడానూ," అంటూ నిట్టూర్చింది లెమన్.

"అవునవును. దాన్ని గురించి చెప్పడం మరిచాను. భూమ్మీద బొద్దింక జాతి ఎన్నటికీ అంతరించిపోదని ఎంత చెబుతున్నా పెడచెవిని పెట్టి ఇక్కడే తిష్ఠవేయాలనుకుంటోంది," అని గొణిగాడు ఓమెన్.

"క్వగ్గా ఏమిటి? ఏదో పండు పేరులా వుంది?" అదెలాంటి వింత మృగమో తెలుసుకోవాలని అడిగాను.

"క్వగ్గా అనేది దాదాపు జీబ్రా అంటే చారల గుర్రం లాంటిది," అంటున్నప్పుడు ఓమెన్ కళ్ళు మెరిశాయి.

"ఆపాపు. అలా పిలవడం అంటే, పాపం క్వగ్గాకు పరమ చిరాకు. అది దక్షిణాఫ్రికాకు చెందినది. అక్కడున్న చాలామంది మానవులు దాన్ని జీబ్రా అనే అనుకున్నారు. నువ్వు ఏమైనా చెప్పు. ఫరవాలేదు. కాని, అది జీబ్రా లాగా ఉందని మాత్రం చెప్పొద్దు. పాపం

బాధపడిపోతుంది.'' అన్నది లెమన్ నిర్మొహ మాటంగా.

''ఏడ్చేస్తుందా ఏం?'' అని అడిగాను.

''ఏడవదు. చీనా ఏనుగే అలా చీటికి మాటికి ఏడుస్తుంది. తనను చాలా సున్నిత మైనదిగానూ, ఉద్వేగభరితమైన కవితా హృదయం కలదిగానూ అది భావిస్తుంది,'' అన్నాడు ఓమెన్.

''అదో పెద్ద బోర్,'' అంటూ విసుక్కుంది లెమన్.

''మీలో ఓడలో మరీ కొద్ది మంది మాత్రమే ఉన్నారు ఎందుకు? కత్తి కోరల పులిని కలుసు కోవచ్చనుకున్నాను!'' అన్నాడు తాతయ్య ఆసక్తితో.

''ఎందుకంటే కనీసం పదిలక్షల మంది గుంపుగా రాగలరని ఎదురుచూస్తున్నాం! మాన వులందరూ అనునిర్వకు రాలేకపోవచ్చు. ప్రస్తుత జనాభాలో ఆరోవంతు మందినే అను మతించగలం. వాళ్ళే అతిపెద్ద గుంపు కదా?'' అని వివరించాడు ఓమెన్.

''ఆ ప్రాణులన్నీ అనునిర్వకు మానవుల ఆగమనం కోసం ఎదురుచూస్తున్నాయి,'' అన్నది లెమన్.

''అంటే మాకు ఘనస్వాగతం లభించగలదన్న మాట! మమ్మల్ని కాస్త మంచి బట్టలు ధరించమం టారా?'' అని అడిగాడు తాతయ్య ఎంతో ఉత్సాహంగా.

లెమన్, ఓమెన్ వింతగా ఒకరినొకరు చూసుకున్నారు. ఆ తరవాత లెమన్ మెల్లగా తలాడించింది.

''ఆ... అవును... నిజమే... మీరు మంచి బట్టలు ధరించడం మంచిదే. సందర్భానికి తగ్గట్టు మనమూ నడుచుకోవాలి కదా? బహుశా మేము చీనా ఏనుగును పాట పాడ మని అడగ్గలం. ఇక్కడే ఉండడం ఎందుకు? మనం లోపలికి వెళ్ళొచ్చు కదా? చాలా మంచి ఆలోచన...'' అన్న ఓమెన్ వెంటనే రోదించ సాగాడు.

లెమన్ నెత్తిమొత్తుకుని, ''ఎందుకలా ఊహల్లో విహరిస్తూ మిమ్మల్ని మీరే మోసపు చ్చుకుంటారు. అది తలుచుకుంటేనే బాధ వేస్తోంది. అనునిర్వలోని ప్రాణులకు ప్రస్తు తానికిమీ జాతిపట్ల అంతసానుభూతి అంటూ లేదు,'' అన్నది.

''అంటే?'' అని అడిగాన్నేను.

''అంటే మీరు అంతరించిపోయే అవకాశం ఉంది. ఎక్కువమంది మానవులను గాయపర చగల వారెవరని వాళ్ళు ఒకరితో ఒకరు గొడవ





పడుతున్నారు,'' అన్నాడు ఓమెన్ నీరసంగా.

''మంచి మూడ్‌ను చెడగొట్టేశారు?'' గొణుక్కున్నాడు తాతయ్య. ఆ రోజు తొలి సారిగా ఆయన ముఖంలో విచారం కని పించింది.

నా తలలోపల ఎవరో ఆగకుండా వయొలిన్ వాయిస్తున్నట్టు మెల్లగా తలనొప్పి ఆరంభ మయింది.

అప్పుడే కొందరు మా దగ్గరికి వచ్చారు. కలలు కనే పెద్దపెద్ద కళ్ళతో ఒక లావుపాటి కుర్రాడు, పొట్టి జడలతో ఒక విధమైన దుర్వా సనతో ఇద్దరమ్మాయిలు, చురుకైన చూపు లతో ఒక స్త్రీ.

''మీతో పరిచయం ఏర్పరచుకోవడానికి చాలా సంతోషిస్తున్నాను,'' అంటూ కుర్రాడు కిందికి వంగాడు. ఆ తరవాత, ''మీలాగే జీవిత మనే ముళ్ళపైబడి నెత్తురోడుతున్నప్పటికీ, నేనింకా ఆనందంగానే ఉన్నాను,'' అన్నాడు.

ఆ వినయంబస్తా ఎవరా అని విస్తుపోయి చూస్తూండిపోయాను.

అంతలో లెమన్ గొంతు సవరించుకుని, ''ఇది చీనా ఏనుగు,'' అన్నది.

''క్వగ్గా,'' చురుకైన చూపుల స్త్రీ అన్నది హుందాగా.

''డైనోజార్లు,'' అన్నది ఒక అమ్మాయి తననూ తన సోదరినీ చూపుతూ.

''డైనోజార్లు కంపు కొడతాయని నీతో చెప్పాను కదా?'' అని నా చెవిలో రహస్యంగా చెప్పింది లెమన్.

నేను అవునన్నట్టు తలాడించాను.

మేమింకా వర్తమానకడలిలోనే ఉన్నాం. అనునిర్వ ఎక్స్‌ప్రెస్ ఆర్క్ అదృశ్యంగా ఉంది. అయితే, వర్తమాన పరిధిలోకి వచ్చినప్పుడల్లా మానవేతర ప్రాణులు తగు హెచ్చరికతో మానవ రూపాలతోనే వస్తాయి. ఈ ప్రాణులు అసలు రూపాలతో ఏ క్షణాన్నయినా మీదపడి చంపగ లవన్న నిజం నా మనసులో ఎక్కడో లీలగా కదలాడింది.

''మమ్మల్ని చూసి భయపడకండి. డోడోలు మిమ్మల్ని గురించి చెప్పాయి. మీకు ఎలాంటి హానీ చెయ్యం,'' అన్నది క్వగ్గా, నా ఆలోచన లను పసిగట్టినట్టు.

''కృతజ్ఞతలు!'' అన్నాన్నేను.

''అవును. మేము అప్పుడే మిమ్మల్ని గురించి ఆ 'ఒకరి'తో మాట్లాడాము,'' అన్నది లెమన్.

''ఆ ఒకరు ఎవరు?'' అడిగాడు తాతయ్య తెలుసుకోవాలన్న తపనతో.

''మయూరి, పరివర్తన మయూరి మ్యూటెంట్,'' అన్నది క్వగ్గా.

''మయూరి మానవులకే జన్మించింది. కాని మానవకాంత కాదు. ఆమె తల్లి కడుపులో ఉన్నప్పుడు పర్యావరణ ప్రమాదం వాటిల్లి, తల్లి విషవాయువులను పీల్చవలసి వచ్చింది. మయూరి నాలుగు చేతులతో నీలవర్ణంతో జన్మించింది. ఆమె లాగా అనునిర్వలో వేరెవ్వరూ లేరు.''

''ఆమె మనిషే అయినప్పుడు మాకు సాయపడవచ్చు కదా?'' అని అడిగాను నేను ఎంతో ఆశతో.

''ఆమె మనిషీ కాదు; మనిషి కానిదీ కాదు. లోపంతో పుట్టడం వల్ల, ఆమెను తన జాతి వదులుకున్నది. గాలిని విష వాయువులతో కలుషితం చేసే మానవ దురహంకారానికి పుట్టిన శిశువు ఆమె!''

''అవును. ఆమెలాంటి మ్యూటెంట్ అదే రూపంలో మళ్ళీ పుట్టదు గనక, ఆమె అనునిర్వలోనే ఉండిపోయింది. ఆమె మనిషిగా ఉండడానికి ఉద్దేశించబడిందిగాని, ఆమె తన జాతి కన్నా ఎంతో ముందుగానే అంతరించిపోయింది. మయూరి మాలా నిర్బంధంకొద్దీ భూమిని వదిలిపెట్టవలసి వచ్చిన ప్రాణుల బాధను అర్థం చేసుకుంటుంది. దేన్నయినా ఆమె నిర్ణయించి ఆజ్ఞాపిస్తుంది. మేము చేస్తాము,'' అన్నది ఒక డైనోజార్.

''ఇతర అనునిర్వ వాసుల బారి నుంచి మమ్మల్ని సురక్షితంగా కాపాడడం కోసం మీరెలాంటి పథకం వేశారు?'' అని అడిగాడు తాతయ్య కనుబొమలు ఎగురవేస్తూ.

''పథకం అంటూ ఇంకా ఏదీ లేదు,'' అన్నది లెమన్.

''అలా అయితే, మనమే ఒకపని చేద్దాం. అనునిర్వలో అడుగుపెట్టేప్పుడు మన మందరం మానవరూపాల్లోనే ఉంటే ఎలా ఉంటుంది?'' అని అడిగాడు తాతయ్య. తలాడిస్తూ.

''సాధారణంగా, వర్తమానాన్ని దాటిన క్షణమే మా అసలు రూపాలకు మారిపోతాం. ఇప్పుడు ఇలాగే ఉండిపోతే, నిజమైన మనుషులు ఎవరో కనుగొనడానికి అక్కడి ప్రాణులు తికమకపడవలసి ఉంటుంది!''

''అది అర్థవంతమైన వివరణగా కనిపిస్తోంది,'' అన్నాడు తాతయ్య. మేమందరం ఒప్పుకున్నాం.

బొద్దింక ఒకటి మత్తుగా ఊగుతూ ఎగిరి రావడం గమనించాను.



ఓమెన్ ముక్కుపుటాలను పైకెత్తి, ''రాబిన్, మేమిక్కడ మాట్లాడుకుంటున్నది తెలియ లేదా?'' అని అడిగాడు.

''ఎవరికిగాని పేర్లు పెట్టడంలో మీకు నమ్మకం లేదనుకున్నాను,'' అని అడిగాను.

''దాన్ని అవమానించడానికి అలా పేరు పెట్టాం నాయనా! అది రాబిన్ బొద్దింక,'' అన్నది లెమన్.

రాబిన్ బొద్దింక దాన్నంతా పట్టించుకు న్నట్లు లేదు. తిన్నగా మా దగ్గరికి వచ్చి కీచు గొంతుతో, ''అంతరించి పోయిన జంతువుల అనవసరమైన చిల్లర మల్లర వివరాలన్నీ ఏకరువుపెట్టి వీళ్ళు మిమ్మల్ని భయపెట్టి ఉంటారు. అవునా?'' అని అడిగింది.



''దాడికి గురికాకుండా అనునిర్వలో ప్రవే శించడానికి ఒక పథకం రూపొందించడానికి ప్రయత్నిస్తున్నాం,'' అన్నాన్నేను.

''అది చాలా సులభం. భూగర్భాన్ని ఉప యోగించుకోండి,'' అని సలహా ఇచ్చింది బొద్దింక మీసాలను ఆడిస్తూ.

''అక్కడేం ఉంటుందో నీకు తెలుసా? మనం ఓడను పగలగొట్టి భూగర్భంలోకి చేర డానికి సముద్ర ప్రాణుల సాయం కోరవచ్చు. అయితే, అక్కడి ప్రాణుల రాజకీయ విభేదాల కారణంగా అవి సాయపడడానికి ఎలాగూ ఒప్పుకోవు. అందువల్ల రాత్రయ్యే వరకు వీరిని ఇలాగే ఉంచి, చీకట్లో తప్పించుకో వడం క్షేమం.''

''ఓడను పగలగొట్టడమా? అలా చేయ డానికి మిమ్మల్ని అనుమతిస్తారా?'' అని అడి గాడు తాతయ్య.

''అనుమతి ఉన్నదనుకోండి. అడుగున ఉన్న పలకను తొలగించి నౌకను అలాగే లోప లికి ముంచుతాం. జలగర్భంలో అంతరించి పోయే ప్రాణులను ఆ పద్ధతిలోనే సేకరిస్తాం,'' ఓర్పుగా వివరించింది ఒక డైనోజార్.

''నీళ్ళ లోపల మేమెలా శ్వాసించగలం?'' అని అడిగాను.

''వాటన్నిటికీ కావలసిన ఏర్పాట్లు ఉన్నాయి. విచారించకు నాన్నా,'' అని ధైర్యం చెప్పింది లెమన్.

''అప్పుడు మనం మామూలు రూపాలకు మారిపోవచ్చా? ఎప్పుడైనా రూపం మార్చుకో వడం బాగానే ఉందిగాని తొండం లేకుండా

ఉంటోంది,'' అన్నది చీనా ఏనుగు. అప్పుడప్పుడు అది మాట్లాడుతున్నప్పటికీ దాని చూపులన్నీ ఎప్పుడూ సముద్రం మీదే ఉంటున్నాయి.



''పథకం అందించిన నాకు కృతజ్ఞత చెప్పనేలేదు. చాలా గొప్పోళ్ళు,'' అన్నది బొద్దింక అటూ ఇటూ కదలడం ఆపి.

''క్షమించు. చాలా కృతజ్ఞతలు,'' అన్నాడు తాతయ్య క్షమాపణలు చెబుతున్నట్టు.

బొద్దింకకు ఆశ్చర్యం వేసినట్టుంది. ''గొప్పవాడివిగా ఉండాలనుకోవడం లేదా? నాకు కృతజ్ఞతలు చెబుతున్నావు?'' అన్నది.

తాతయ్య ఆశ్చర్యంగా చూస్తుంటే బొద్దింక ఆనందంగా ఓడవెనక భాగానికివెళ్ళి, ''సముద్రపు దొంగలు! ఇదిగో మేము వచ్చాం!'' అని కేక పెట్టింది.

లెమన్, ఓమెన్, గువ్వా, రెండు డైనోజార్లు, చీనా ఏనుగు వలయాకారంగా నిలబడ్డాయి. కళ్ళు మూసుకుని వింతభాషలో ఏవో గొణగ సాగాయి. అదో అపరిచిత వింత సంగీతం...

*అందులో ఉన్నాయి...!*
*చెట్ల గుసగుసలు!*
*తేనెటీగల ఝుంకారాలు!*
*సెలయేళ్ళపాటలు!*
*స్వప్నాల యెడదసవ్వడులు!*
*లేళ్ళ గెంతులు పిసరంత!*
*భయావహలోహగంధాలు!!*

పాట ముగియగానే తెలియవచ్చింది నేనెప్పుడో కళ్ళుమూసుకున్నానని. నా కనురెప్పల కెంజాయ తరంగాల మాటున పెద్దపెద్ద నల్లటి రూపాలు కదలాడాయి. ఏం చూడవలసి వస్తుందోనన్న భయంతో కళ్ళు తెరవడానికి భయపడ్డాను.

''శివా!'' అన్న తాతయ్య పిలుపుతో మెల్లగా కళ్ళు తెరిచాను.

అక్కడ.. భయానకమైన ఎర్రటి ఆకాశం. భయంకరమైన డైనోజార్ల తలలు. వాటి శరీరం మీద పచ్చటి పొలుసులు అద్దాల్లా మెరుస్తున్నాయి. చీనా ఏనుగు పెద్దపెద్ద చెవులు ఆడిస్తూ నాకేసి వంగి చూస్తున్నది.

గువ్వా నెమ్మదిగా నిట్టూర్చింది. అది జీబ్రాలాగా కనిపిస్తున్నది. కాని నేనామాట చెప్పడానికి సాహసించలేదు. లెమన్ తన ముక్కుతో నా చొక్కాను తాకి, ''అనునిర్వకు స్వాగతం!'' అన్నది మృదువుగా.

''మనం దాదాపు గమ్యం చేరుకున్నాం!'' అని ప్రకటించాడు ఓమెన్. -*(ఇంకావుంది)*

-సౌమ్యా రాజేంద్రన్

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

Because stories make the world go round...

**Choose** your Chandamama!
Go to www.chandamama.com or SMS CSHOP to 54646 & we'll get in touch with you!
Subscribe Now!!



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ...........................................................................................

Date of Birth: ................................ Sex :......................................

Address: ........................................................................................

.....................................................................................................

.....................................................................................................

........................................................ City: .....................................

State:........................................... Pin:..............................................

Telephone:......................................................................................

Mobile:............................................................................................

Email:..............................................................................................

Subscription Number 9for renewals):..............................................

Gift Subscription to the following address:

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

Enclosed Cheque/DD* for Rupees.....................................................

Cheque/DD No · .............................................................................

favouring Chandamama India Ltd on..............................................

..........................................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

Annual Subscription Overseas : US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# పాతాళదుర్గం-13



*[పొట్టిరాక్షసుడు పడవను అతి చాకచక్యంతో నది వాలుకేసి నడిపాడు. భిల్లులు దానిమీద రాళ్ళు విసరసాగారు. పడవ నదిలో ఉన్న గండశిలకొక దానికి ఢీకొని బద్దలైపోయింది. పొట్టి రాక్షసుడు ఒక స్త్రీతో సహా ఒడ్డుకు చేరాడు. ధూమకుడూ వాళ్ళు కూడా ఒడ్డు చేరేంతలో, శిథిలదేవాలయం నుంచి ఒకపెద్ద నరవానరం గెంతులు వేస్తూ వాళ్ళపైకి రాసాగింది. -తరవాత]*

ధూమకుడు అందరికన్న ముందున్నాడు. అతడు తమపైకి వస్తున్న నరవానరంకేసి, దాని వెనక చెట్లమీద ఉన్న ఇతర మృగాలకేసి ఓమారు చూశాడు. చెట్టుకొమ్మల్లో ఉన్న చిన్నాపెద్ద నరవానరాలూ, ఎలుగుబంట్లూ అన్నీ కళ్ళప్పగించి తమవైపే చూస్తున్నట్టు అతడు గ్రహించాడు.

‘‘విరూపా! ఇది వింతగా లేదా? మనిషంటే ఎంతటి క్రూరమృగమైనా భయపడి పారి పోతుంది. కానీ, వీటి ప్రవర్తన అందుకు భిన్నంగా ఉంది. బహుశా, ఈ మృగాలు ఈనాటి వరకూ మానవమాత్రుణ్ణి చూసి ఉండవేమో. అందుకనే మనవైపు అలా వింతగా చూస్తు న్నాయి,’’ అన్నాడు ధూమకుడు.

విరూపుడు, ధూమకుడి మాటలేవీ ఆల కించటం లేదు. అతడు తన భుజం మీద ఉన్న నల్లగరుడపక్షిని దువ్వుతూ, ఒక్కొక్క అడుగే ముందుకేస్తూ, వికృతంగా అరుస్తున్న నరవానరంకేసి చూడసాగాడు. సోమకుడు బాణం ఎక్కుపెట్టి, ధూమకుడి ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నాడు. పులిందుడు ఇవేమీ గమనించటం లేదు, అతడి దృష్టి నదికి కొంచెం దిగువగా ఒడ్డు చేరిన పొట్టిరాక్షసుడిపైనా, అతడి పక్కనే సొమ్మసిల్లి పడివున్న స్త్రీ మీదా ఉన్నది.



తాము పొట్టిరాక్షసుణ్ణి పట్టుకుంటే, అతడి ద్వారా మహాకలిని గురించిన ఎన్నో రహస్యాలు తెలుసుకోవచ్చు. రాజకుమార్తె కాంతిసేనను వెతికి తెచ్చే బాధ్యత మీద వేసుకున్నది తనూ, సోమకుడూ. ఆ ప్రయత్నంలో పులిందుడూ, విరూపుడూ తమకు సాయం చేయాలంటే, పులిందుడికి అతడి పడుచుభార్యను తిరిగి సంపాదించేందుకూ, విరూపుడికి మాంత్రికుడైన కాలశంబరుడి యోగక్షేమాలు తెలుసుకునేందుకూ తాము తోడ్పడక తప్పదు...

''పులిందా, ఆగు! మేమూ వస్తున్నాం. తెప్పల మీద పోయి, ఆ రాక్షసుడున్న చోటనే తీరం చేరుదాం. వాడు, ఈలోపల అరణ్యంలోకి ఎంతో దూరం పారిపోలేడు,'' అన్నాడు ధూమకుడు.

ఆ వెంటనే అందరూ తెప్పలకేసి బయలుదేరారు. ధూమకుడూ, సోమకుడూ మాత్రం నరవానరానికి వెన్ను చూపక, జాగ్రత్తగా వెనక్కు నడవసాగారు. కానీ, వాళ్ళావిధంగా తెప్పలకేసి పోవటం చూస్తూనే, నరవానరం రొమ్ము చరుచుకుని భయంకరంగా అరిచి కుప్పిగంతేసి ముందుకు దూకింది. చెట్ల మీద ఉన్న మృగాలన్నీ బిలబిల మంటూ కొమ్మలమీంచి కిందికి దూకి ధూమకుడూ వాళ్ళకేసి పరిగెత్తుకు రాసాగాయి.

ఇది చాలా ప్రమాదకరమైన పరిస్థితి. వెన్నిచ్చి పరిగెత్తటం ప్రారంభిస్తే, తాము తెప్పలను చేరకముందే నరవానరాలూ, ఎలుగుబంట్లూ తమ మీదికి వచ్చి పడతై. అలాకాదని నిలబడి దెబ్బతీయాలని చూసినా, ఇన్ని

ధూమకుడు నిర్భయంగా నిలబడి నరవానరానికేసి ఈటె గురిచేసి, సోమకుణ్ణి బాణం వదలవద్దని వారిస్తూ, ''ఈ వానరం ఆ చెట్లమీద ఉన్న మృగాలకన్నిటికీ నాయకుడులా ఉన్నది. దీన్ని చంపామో, అవన్నీ మన మీద వచ్చి పడొచ్చు. దీన్ని భయపెట్టి తరుముదాం,'' అన్నాడు.

ఇంతలో పులిందుడు ఒక పెద్ద గావుకేక పెట్టి, తెప్పలకేసి పరిగెత్తుతూ, ''ఆ పొట్టి రాక్షసపు వెధవ నా పెళ్ళాన్ని తీసుకుని అరణ్యంలోకి పారిపోబోతున్నాడు. ముందు ఆ దుర్మార్గుణ్ణి పట్టుకుని, నా పెళ్ళాన్ని వాడి చెర నుంచి విడిపించాలి,'' అన్నాడు.

భిల్లనాయకుడైన పులిందుడి మాటలు ధూమకుడికి సబబుగానే అనిపించాయి.

క్రూరమృగాలను ఎదిరించి జయించటం సాధ్యమయ్యే పనికాదు...

ధూమకుడిలా ఆలోచిస్తూ, పక్కకు తిరిగి సోమకుడితో ఏదో చెప్పబోయేంతలో, వెనక్కు అడుగులేస్తున్న సోమకుడు కాలు జారి ముందుకు తూలాడు. అది చూస్తూనే నర వానరం అతడికేసి దూకబోయింది. కాని, ఇంతలో విరూపుడు పెద్దగా, ''అహ్హా, శాంభవీ!'' అంటూ, ''కాలగరుడా, నీ కాలిబలం, ముక్కు వాడీ చూపించు! అందుకు ఇదే మంచి తరుణం,'' అంటూ భుజం మీద ఉన్న నల్ల గరుడపక్షిని నరవానరంకేసి విసిరాడు.

గరుడపక్షి రెక్కలు చాచి లేస్తూనే మెరుపులా పోయి నరవానరం తలమీద బలంగా ఒక్క తన్ను తన్నింది. వానరం ఆ తన్నుకు వెల్లికిలాపడి 'అరుస్తూ లేచి, గరుడపక్షికేసి చేతులు చాచబోయేంతలో, పక్షి అంత ఎత్తు నుంచి రెక్కలు టపటపలాడిస్తూ వచ్చి, వానరం మెడమీద గట్టిగా ఒక దెబ్బ కొట్టింది.

ఆ దెబ్బకు నరవానరం ఎగిరి అల్లంత దూరాన ఉన్న రాళ్ళమీద పడి, పల్లానికి దొర్లుకుపోయింది.

తమ నాయకుడు మట్టికరవటం చూస్తూనే, తతిమ్మా మృగాలు ఎక్కడివక్కడ నిలిచిపోయాయి. అదే అదనుగా ధూమకుడూ అతడి అనుచరులూ పరిగెత్తుకుంటూ పోయి తెప్పలను చేరారు. అందరికన్న వెనకగా తెప్ప ఎక్కినవాడు విరూపుడు. అతడు ఈలలు కొడుతూ, చిటికెలు వేస్తూ, నల్లగరుడపక్షిని తిరిగి పట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు.





కాని, గరుడపక్షి ఎగురుతూపోయి, శిథిల దేవాలయం మీద కొద్దిసేపు కూర్చుని, కీ అని అరుస్తూ లేచి, గాయపడిన నరవానరం చుట్టూ చేరిన మృగాల తలల మీదుగా రివ్వు రివ్వుమని ఎగరసాగింది.

''విరూపా! ఆ పక్షి ఇక నీదికాదు, దాని సంగతి మరిచిపో. దాని కోసం ఎదురుచూస్తూంటే కాలయాపన తప్పదు. అది మనకు చేయగల సహాయం ఏదో చేసింది. మనం తీరం వెంటపోయి, ఆ పొట్టి రాక్షసుణ్ణి చేజిక్కించుకోవాలి,'' అన్నాడు ధూమకుడు.

విరూపుడు ఇంకా ఆశగా గరుడపక్షి కేసే చూస్తున్నాడు. దాని కాలి నుంచి అతడు కట్టిన తాడు కిందికి జీరాడుతూనే ఉన్నది. ''అది, నా పెంపుడు పక్షి. నన్ను వదిలిపోదు, చూస్తూండండి... నా చిన్న బాబువు కదూ, కాలగరుడా, ఇటురా!'' అంటూ విరూపుడు చప్పట్లు చరిచి కేకలు వేయసాగాడు.

తెప్పలు రెండూ ముందుకు కదిలాయి. పులిందుడు తన అనుచరులను తెడ్లు వేయమని తొందరపెడుతున్నాడు. తాము సమీపించే లోపలే పొట్టిరాక్షసుడు, తన పడుచు పెళ్ళాన్ని ఎత్తుకుని అరణ్యంలోకి పారిపోతాడని పులిందుడికి పెద్ద భయంగా ఉన్నది.

కాని, ఆ పొట్టి రాక్షసుడు పారిపోయే ప్రయత్నం ఏమీ చేయకపోగా, తన వెంట ఉన్న స్త్రీ భుజాల మీద చేయివేసి చిరునవ్వు నవ్వుతున్నాడు. అంతేకాక తానున్న ప్రదేశాన్ని సమీపిస్తున్న తెప్పలను ఆవిడకు చూపిస్తూ, వేలితో పులిందుణ్ణి ప్రత్యేకంగా గుచ్చెత్తి చూపి ఏదో అడిగాడు. స్త్రీ ఏమో చెప్పి నవ్వింది. పొట్టి రాక్షసుడు పొట్టచెక్కలయ్యేలా నవ్వుతూ తీరం వెంట కొంత దూరం ముందుకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''మీరు వస్తున్నది నన్ను పట్టుకోవటానికా, నా పెళ్ళాన్ని పట్టుకోవటానికా?'' అని కేక వేసి అడిగాడు.

తెప్పల్లో ఉన్న అందరి దృష్టి, పులిందుడి కేసి మళ్ళింది. పులిందుడు రాక్షసుడి మీద కలియబడేందుకు నీళ్ళల్లో దూకి ఒడ్డుకు ఈదుకుపోతాడని వాళ్ళు భావించారు. కానీ, పులిందుడిలో ఎలాంటి చలనమూ లేదు. అతడు గుడ్లప్పగించి నది ఒడ్డునున్న స్త్రీకేసి అమితాశ్చర్యంతో చూస్తున్నాడు.

''అది నా పడుచు పదోపెళ్ళాం కాదు. నా పెళ్ళాం పడవ మునిగినప్పుడు నదిలో పడి

చచ్చిపోయయినా ఉంటుంది, లేదా ఆ బుడంకాయ రాక్షసుడు దాని మీద మంత్ర ప్రయోగం చేసి రూపయినా మార్చి ఉంటాడు. నా శ్రమ అంతా వృథా అయింది,'' అన్నాడు పులిందుడు ఎక్కడ లేని నిరాశా నిస్పృహలు కనబరుస్తూ.

తెప్పలు రాక్షసుడున్న చోటు చేరగానే, ధూమకుడు అందరికన్న ముందు ఒడ్డుకు దూకాడు. రాక్షసుడు స్త్రీతోపాటు ఒడ్డు నుంచి ఒక ఇరవై అడుగుల దూరం వెనక్కుపోయి నిలబడి, ''మీతో నాకు శత్రుత్వం ఏమీ లేదు. ఈ ఆడది మీలో ఎవరి పెళ్ళాముకాదు. దీని కోసమేగదా మీరింత దూరం నా వెంట బడి వచ్చింది? ఇక మీదారిన మీరుపొండి, నా దారిన నేను పోతాను,'' అన్నాడు.



ఆ మాటలకు ధూమకుడు నవ్వి, ''మా మనుషుల్లో ఒక సామెత ఉంది: పొట్టివాడికి పుట్టెడు జిత్తులని! నువ్వు రాక్షసుల్లో వామను డివి, నీ దగ్గిర పది పుట్ల జిత్తులుండవచ్చు. మాకూ నీతో ఎలాంటి శత్రుత్వమూ లేదు. మాకు కావలసిందల్లా, మహాకలిరాక్షసు డుండే పాతాళదుర్గానికి దారి. ఆ దారి ఎక్కడో మాకు చెప్పి, నీ దారిన నువ్వుపో, మా దారిన మేము పోతాం,'' అన్నాడు.

''పాతాళదుర్గానికి వెళ్ళినవారెవరూ ప్రాణా లతో బయటపడలేరు. అంత కావాలను కుంటే, ఆ దారి తెలుసుకుని కాళ్ళరిగేట్టు నడవటం ఎందుకు? ఒకటిరెండు నెలలపాటు ఈ ప్రాంతాలే తిరుగుతూండండి. ఆ మహా కలి రాక్షసుడి బంట్లు వచ్చి మిమ్మల్ని కాళ్ళూ చేతులూ కట్టి, వాడి పాతాళదుర్గానికి మోసు కుపోతారు,'' అన్నాడు పొట్టిరాక్షసుడు.

''అలా కాదు. ఆ దుర్మార్గుడికి తెలియ కుండా వాడి దుర్గంలో ప్రవేశించి, ఒకానొక రాజకుమార్తెను రక్షించి తేవలసి ఉన్నది,'' అన్నాడు ధూమకుడు.

''నా పడుచుపెళ్ళాం, భామాసింగి కూడా వాడి చెరలోనే ఉన్నది, అనుమానం లేదు. వాడి నౌకర్లే గదా దాన్ని అరణ్యంలో నుంచి ఎత్తుకుపోయింది! ఆ మహాకలి రాక్షసుడి పీక నరికి, వాడి నెత్తురుతో దాహం తీర్చుకుం టాను,'' అన్నాడు పులిందుడు.

పొట్టి రాక్షసుడు మారు మాటాడకుండా, ధూమకుడూ వాళ్ళ దగ్గిరకు వచ్చి, ''నేను ఇవ్వవలసిన హెచ్చరికేదో ఇచ్చాను, తరవాత

మీ ఇష్టం. పాతాళదుర్గానికి వెళ్ళేందుకు దగ్గిర మార్గమేదో మీకు చెపుతాను, నా వెంట రండి,'' అంటూ వాళ్ళను వెంటబెట్టుకుని శిథిలదేవాలయానికేసి బయలుదేరాడు.

దేవాలయం ఇంకా కొంచెం దూరంలో వున్నదనగా ధూమకుడు ఆగి, ''మనం వెళుతున్నది ఆ దేవాలయ ఆవరణలోకా? అక్కడున్న క్రూరమృగాల మాటేమిటి? ఇంతకు ముందే వాటివల్ల పెద్ద ప్రమాదంలో పడ్డాం,'' అన్నాడు.

''మీకు సంగతి తెలియక వాటిని రెచ్చగొట్టారు. అవన్నీ రాక్షసబంట్ల పెంపుడు జంతువులు. ఇన్ని అడవికాయలూ, దుంపలూ వాటికేసి గిరవాటు వేస్తే, అవి పిల్లుల కన్నా సాధుజంతువులైపోతాయి,'' అంటూ పొట్టిరాక్షసుడు, దాపుల నున్న చెట్ల నుంచి ఇన్ని కాయలు కోశాడు. అతడితోపాటు ధూమకుడూ వాళ్ళు కూడా కాయలు కోసి తీసుకుని, శిథిలదేవాలయాన్ని సమీపిస్తూనే, వాటిని అడవిమృగాల మీదికి విసిరవేశారు. పొట్టిరాక్షసుడు అందరినీ ఆలయంలోకి తీసుకుపోయి, చీకటిగా ఉన్న కొన్ని గదులగుండా వాళ్ళను నడిపించి, చివరకు బీటలువారి నేలకూలడానికి సిద్ధంగా ఉన్న ఒక కందకాన్ని చూపిస్తూ, ''పాతాళదుర్గానికి పోవాలంటే ఒకేఒక మార్గం ఉన్నది, అదే ఇది!'' అన్నాడు.

ధూమకుడూ, అతడి అనుచరులూ కందకంలోకి చూశారు. అందులో మొసళ్ళూ, పెద్ద పెద్ద సర్పాలూ ఉన్నవి. అవి ఒకదాని మీద ఒకటి కలియబడి కుస్తీపట్లు పట్టుతున్నవల్లా, గోడ మీద మనుషులు కనబడగానే, నోళ్ళు తెరిచి పైకి చూడసాగాయి. -(ఇంకాఉంది)



## నిప్పులపై నడక



ఇసుకపై, నీళ్ళల్లో పాదరక్షలు లేకుండా నడవగలంగానీ, నిప్పులపై నడవగలమా? నడవగలం!

దక్షిణ భారతదేశం, దక్షిణాఫ్రికా, శ్రీలంక, మలేషియా, సింగపూర్ హిందువులు కొందరు కణకణలాడే నిప్పుల గుండంలో నడవడం భక్తి ప్రపత్తులతో నిర్వర్తిస్తారు. మొక్కు బడి చెల్లించడంలో ఇదొక విధానం!

మహాభారత యుద్ధంలో కౌరవులు నిర్మూలించబడిన తరవాత, తన ధర్మనిరతిని నిరూపించడానికి ద్రౌపది అగ్ని ప్రవేశం చేసిందట. దానికి గుర్తుగానే భక్తులు తమ మొక్కు బళ్ళను ఇలా నెరవేరుస్తారు. ఈ సంప్రదాయం ప్రమాదభరితమైనదన్న విమర్శలు ఉన్నప్పటికీ మారుమూల గ్రామాల నుంచి, పట్టణాలు, నగరాల వరకు ఇది ఇంకా కొనసాగుతూనే ఉన్నది.

## అస్సాం గిరిజన సంప్రదాయాలు

అస్సాంలోని ప్రతి గిరిజన తెగకూ కొన్ని నిర్దిష్ట సంస్కృతీ సంప్రదాయాలు ఉన్నాయి. వాటిలో విచిత్రమైన నమ్మకాలుగల దీయో సంప్రదాయం ఒకటి. తమ పూర్వులు హిమగిరి నుంచి వచ్చి ఉత్తర అస్సాంలో స్థిరపడ్డారని దీయోరీలు విశ్వసిస్తారు. దియో ఉధా అనే క్షుద్రశక్తి స్త్రీనిగానీ, పురుషుణ్ణిగానీ ఆవహిస్తుందనీ, ఆ సమయంలో గ్రామం గురించీ, మనుషుల గురించీ వాళ్ళు చెప్పే మాటలు తప్పకుండా ఫలిస్తాయనీ ఈ గిరిజనులు దృఢంగా విశ్వసిస్తారు. ఈ దియో మామూలు ఆహారం తీసుకోదు. గుడులలో బలులిచ్చే జంతువుల నెత్తురు మాత్రమే తాగుతుందట! ఈ క్షుద్రశక్తి స్త్రీలను మాత్రమే ఆవహిస్తుందన్నది వీళ్ళ దృఢమైన విశ్వాసం. వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలో ఎంతో పురోగమించినప్పటికీ ప్రపంచ వ్యాప్తంగా అక్కడక్కడ కొన్ని జాతుల ప్రజలు ఇంకా ఇలాంటి వింత సంప్రదాయాలను, విశ్వాసాలను అనుసరిస్తూనే ఉన్నారు.




భారత్‌లో మొదటి డీలక్స్ రైలు దక్కన్ క్వీన్. telugu.chandamama.com భారత దర్శిని చూడండి

# కింగ్ ఖానా







## తందూరీ సుదీర్ఘ పయనం!



తందూర్ అనే మట్టి ఆవం(పొయ్యి)మీద ప్రత్యేక రీతిలో తందూరీ వంటకం చేస్తారు. ఆ పొయ్యిని మట్టిలో పూడ్చిపెట్టి దాని నుంచి వెలువడే బొగ్గుల నిప్పులమీద లేదా మంట మీద ఈ వంటను వండుతారు.

****



దాదాపు రెండువేల సంవత్సరాలకు పూర్వం, ఈజిప్టులో పిరమిడ్లను నిర్మించినప్పుడు, కార్మికులకు రొట్టెలు తయారు చేయడానికి తందూర్ లాంటి ఆవంలను ఉపయోగించారు.

****



సింధులోయలో వెలసిన హరప్పా, మొహంజదారో ఆవాసాల లోనూ పక్క తలుపుతో తందూర్ లాంటి చిన్న మట్టిపూసిన ఆవంలు కనుగొనబడ్డాయి.

****



ఆఫ్ఘనిస్థాన్‌లో సొంతంగా ఆవంలు ఏర్పరుచుకునే స్తోమత అందరికీ ఉండేది కాదు. అందువల్ల పిండిని కలిపి ముద్దగా తయారు చేసి, తందూర్ బ్యాకరీకి తీసుకుపోయి అక్కడ కాల్చుకునేవారు.

****



తందూర్ వంటకం పర్షియా నుంచి మెల్ల మెల్లగా ఆఫ్ఘనిస్థాన్ చేరి ప్రాచుర్యం సంతరించుకున్నది. అక్కడి నుంచి అరబ్బులు దాన్ని ఉత్తర భారతదేశానికి తీసుకువచ్చారు.



జహాంగీర్ చక్రవర్తి తండూర్‌ను ఒకచోటి నుంచి మరోచోటికి తీసుకు వెళ్ళేలా చేశాడు. ఆయన ఎక్కడికి వెళ్ళినా తండూరీ వంటకాలను ఇష్టంగా తినేవాడు.

****




పెషావర్‌లో కుందన్‌లాల్ గుజ్రాల్ అనే ఆయన మోతీమహల్ అనే భోజనశాల నడిపేవాడు. ఆయన అక్కడ వేడివేడి తండూరీ చికెన్ వడ్డించేవాడు. అచిరకాలంలోనే అది ఖాతాదారులకు అభిమానపాత్రమైన వంటకంగా మారిపోయింది.

****



1947 విభజన తరవాత గుజ్రాల్ తన భోజనశాలను ఢిల్లీలోని దార్యాగుంజ్‌కు మార్చాడు. ఆయన రెస్టారెంట్ అంతకు ముందు కన్నా అత్యంత ప్రాచుర్యం పొందింది.

****



ఇరాన్ షా ఒకసారి ఇలా అన్నాడు...

ఇండియాకు వెళ్ళి మోతీమహల్లో తినకుండా రావడం, ఆగ్రాకు వెళ్ళి తాజ్‌మహల్‌ను చూడకుండా రావడం లాంటిదే!



****



తండూర్ అంతదూరం పయనం చేసి ఇండియాకు వచ్చింది. మీరూ ఇరాన్ షా అభిప్రాయంతో ఏకీభవిస్తారా? రుచి చూసి తెలుసుకోండి మరి!

మోతీ మహల్లో వడ్డించే తండూరీ చికెన్ అంటే జవహర్‌లాల్ నెహ్రూకు మహా ఇష్టం. ఆయన ఇచ్చే విందుల్లో తండూరీ చికెన్‌కు ప్రత్యేక స్థానం ఉండేది. మన దేశానికి విచ్చేసే విదేశ ప్రముఖులు ఆ వంటకాన్ని ఇష్టంగా తినేవారు.





# ఆశాజ్యోతి

*క్రీ.పూ. 489, మగధరాజ్య రాజధానీ నగరం రాజగృహ.*

సాయంసంధ్యా సమయం. ఒకరు కాస్త పొట్టిగా లావుగా, మరొకరు పొడవుగా చలాకీగా ఉన్న ఇద్దరు మనుషులు నగరం శివారు ప్రాంతంలో దుమ్మురేగుతూన్న బాట గుండా నడుస్తున్నారు. బాటకు మరోవైపున తట్టలతో, బుట్టలతో కొందరు స్త్రీపురుషులు తమ పనులు ముగించుకుని ఇళ్ళకు తిరిగి వెళుతున్నారు. మరికొందరు కాపరులు మేతకు తోలుకు వెళ్ళిన పశువులను, మేకలను ఇంటికి తోలుకు వెళుతున్నారు. పొడవుగా ఉన్న వ్యక్తి వారి వేషభాషలను, వారి వస్తువులను పరిశీలనగా చూడసాగాడు. ఇద్దరు మాట్లాడుకుంటూన్న సంభాషణ ఆయన చెవిన పడింది:

''అక్కడి పరిస్థితులు నానాటికి తీసికట్టుగా ఉన్నాయనీ, దారుణమైన మలుపు తిరిగాయనీ విన్నాను,'' అన్నాడు ఒక మేకలకాపరి రాజ కుటుంబం గురించి ప్రస్తావిస్తూ.

''ఆ యువరాజు ప్రవర్తన సరిగా లేదట! అవునా?''

''తండ్రి చేసిన పాపాలు కొడుకును వదిలి పెట్టవు కదా?''

''అలాంటి వారిచేత పాలించబడడానికి, మనమేం పాపం చేసుకున్నామో ఏమో?''

''గట్టిగా అనకు. గాలికి చెవులుంటాయి. నీ మాటలు రాజద్రోహనేరం కిందికి వస్తాయి,'' అని హెచ్చరించాడు కూరగాయల వ్యాపారి.

లావుపాటి వ్యక్తి పొడవుగా ఉన్న తన సహచరుడికేసి చూసి, ఆయన మోములో అలముకున్న విచార ఛాయలను గమనించాడు. ''అలాంటివారి ఉబుసుపోక మాటలను పట్టించుకోకండి ప్రభూ,'' అని సలహా ఇచ్చాడు మెల్లగా.

''ఎలా పట్టించుకోకుండా ఉండగలను జీవకా? వీళ్ళు నా ప్రజలు. నా కుమారుణ్ణి గురించీ, నాపరిపాలన గురించీ మాట్లాడుతున్నారు. అవి నిజం కావా?''



''యువరాజు ఉదయనుడి గురించి నేనేమీ చెప్పడం లేదు. ప్రభూ! అయితే, ఒకటి మాత్రం రూఢిగా చెప్పగలను. మిమ్మల్ని గురించి చెడుగా మాట్లాడే నాలుక కుళ్ళిపోతుంది,'' అన్నాడు జీవకుడు ఆవేశంతో.

‘‘వాళ్ళు నా విశ్వాసపాత్రులైన ప్రజలు,’’ అని కొంతసేపు ఆగిన రాజు అజాతశత్రు, ‘‘అవునా, నువ్వు ఏ మంత్రిగానో, ఆస్థానోద్యోగి గానో ఉండవలసిన వాడివి వైద్యుడివి ఎలా అయ్యావు?’’ అన్నాడు.

‘‘బహుశా, పొగడ్డం చేతకాక ప్రభూ.’’

‘‘ఇప్పుడు కూడా నువ్వు నన్ను పొగడవచ్చు. మనం తలపెట్టిన ప్రయాణ ఉద్దేశం నీకు తెలుసు కదా?’’

కొంతసేపు పైదొలగిన మౌనం మళ్ళీ వారి మధ్య మరింత గాఢంగా నెలకొన్నది. రాజు అజాతశత్రు ఆలోచనలు ఆయన్ను నిర్దాక్షిణ్యంగా గతంలోకి లాక్కెళ్ళాయి.

***

*క్రీ.పూ. 493, రాజగృహ రాజోద్యానం.*

‘‘నీ సంక్షేమం పట్ల ఆలోచనే లేని దయార హితుడైన రాజును ఇంకా ఎంత కాలం సేవిస్తావు?’’ అన్న మాటలు ఆయన చెవిలో జోరీగలా రోదించ సాగాయి.

ఆయన తల పంకించి, ‘‘మా తండ్రి దయా రహితుడు కాదు,’’ అన్నాడు.

‘‘కన్న కుమారుణ్ణీ, ప్రజల అభీష్టాన్నీ గుర్తిం చడానికి నిరాకరించే ఏ రాజైనా దయారహితుడే. మీ తండ్రి హల్ల, నేహల్ల, అభయులను వారస త్వానికి తగినవారిగా భావిస్తున్నాడు,’’ అని మళ్ళీ చెవిలో చెప్పాడావ్యక్తి.

‘‘అభయుడా? అంబపాలి కుమారుడా?’’

‘‘ఒక రాజోద్యోగి పాలనను నువ్వు చూడ గలవా? నువ్వు చెల్లన కుమారుడివి, లిచ్ఛవీ వంశంలో సుప్రసిద్ధుడైన చేతకుడి మనవడివి. నువ్వు అర్హుడివి. పరిపాలన జరిపే అర్హత నీకున్నది..’’



‘‘నాకు ఉన్నదా దేవదత్తా?’’

‘‘అవును, కునికా-అది నీ హక్కు. బింబిసార రాజును హతమార్చి, నువ్వే మగధ సింహాసనాన్ని అధిష్ఠించు..’’

మొదట దిగ్భ్రాంతికీ, భయోద్వేగానికీ లోనైనప్పటికీ క్రమక్రమంగా దేవదత్తుడి మాటలే వాస్తవమనిపించాయి. అజాతశత్రు తండ్రిపై తిరుగుబాటు చేసినట్టుగానే, అతడు గౌతమ బుద్ధుడికి వ్యతిరేకంగానూ మారాడు. దేవద త్తుడు నిజమే చెబుతున్నాడని.. అతడు తండ్రిని హతమార్చాడు.

***

*క్రీపూ. 489, రాజగృహ శివారు అడవి ప్రాంతం.*

అజాతశత్రు చుట్టూ దట్టంగా అలముకుం టూన్న గాఢాంధకారం. ఎదురుగుండా చిట్టడవి. మనసులోపల ముసురుతూన్న ఏవేవో ఆలోచ నలు. ‘‘విపరీతమైన ఆలోచనలతో విషాదానికి లోనుకాకండి, ప్రభూ!’’ అన్నాడు జీవకుడు రాజు ముఖంలోని భావాలను పసిగట్టినవాడిలా.

‘‘మనం ఎక్కడికి వెళుతున్నదీ నువ్వింకా చెప్పనేలేదు.’’



‘‘తమకు సరియైన సలహాలిచ్చి, తమ బాధలను పోగొట్టి విముక్తిని కలిగించే మహానుభావుడి వద్దకు.’’

‘‘జీవకా, నా పాప ప్రక్షాళన కోసం నేను ఆరు గురు గురువులను సందర్శించాను. మాఖ్ఖలి గోసాల, నిగ్గాంతనటపుట్టలను కలుసుకున్నాను. వాళ్ళు నాకు పాప వియోచనం కలిగించి శాంతిని ప్రసాదించలేకపోయారు. ఇది కూడా అలాంటి నిష్ఫల పయనం కాదు కదా?’’

జీవకుడు మాట్లాడలేదు.

‘‘మనం ఆయన్ను ఏకాంతంలో కలుసుకుంటామా?’’

‘‘లేదు ప్రభూ! ఆయనకు చాలా మంది అనుయాయులున్నారు. ఇక్కడేపన్నెండువందలాయాభై మంది ఉన్నారు!’’

‘‘ఇంకా ఎంత దూరం వెళ్ళాలి.’’

‘‘దాదాపు గమ్యం చేరుకున్నాం.’’

అడవంతా తెల్లటి ముత్యాల్లాంటి వెన్నెలలు వెదజల్లుతూ కొంతసేపటికి చంద్రోదయమయింది. వనం అలౌకిక సౌందర్యాన్ని సంతరించుకున్నది. చెట్ల నీడల్లో ఏదో అపాయం పొంచి ఉన్నదేమోనన్న ఒక వింత భ్రాంతి మరోవైపు. నిశ్శబ్దం భారంగాఅడవంతా వ్యాపించసాగింది.

హఠాత్తుగా అజాతశత్రు హృదయంలో ఏదో భయం పడగ విప్పింది. ఇదంతా ఎవరైనా పన్నిన పన్నాగం కాదుకదా? అంగరక్షకులు లేకుండా మారు వేషాల్లో పయనించాలని జీవకుడే సలహా ఇచ్చాడు. అతడు తనను ఎక్కడికి తీసుకువెళుతున్నాడు? ‘‘జీవకా, నువ్వేమీ మోసం చేయలేదు కదా? నన్ను శత్రువులకు అప్పగించడం లేదు కదా? అక్కడ అంత మంది జనం ఉన్నప్పుడు ఏమాత్రం అలికిడి కాకుండా ఇంత నిశ్శబ్దంగా ఉన్నదేమిటి?’’

‘‘ఇందులో ఎలాంటి నమ్మకద్రోహమూ లేదు ప్రభూ!’’

తనను అనుమానించినందుకు జీవకుడు నొచ్చుకున్నాడేమో అని రాజు అనుకున్నాడు గాని అతని కంఠస్వరం ఎప్పటిలాగే మామూలుగా ప్రశాంతంగా వినిపించింది.

మరికొంత దూరం నడిచేసరికి విశాలమైన ప్రదేశం కనిపించింది. అక్కడక్కడ చిన్నచిన్న దీపాలు మిణుకుమిణుకుమంటున్నాయి. కాషాయాంబరాలు ధరించిన సన్యాసులు పలువురు చుట్టుముట్టారు. వారిలో ఒక సన్యాసి ముందడుగు వేసి, ‘‘అజాతశత్రు మహారాజు గారికి స్వాగతం. తమ ఆగమనం తమకు శాంతినీ, జ్ఞానాన్నీ ప్రసాదించుగాక!’’ అన్నాడు మృదువైన కంఠస్వరంతో.

రాజులో ఒక విధమైన ఉద్వేగభరిత ఆనందాశ్చర్యాలు. ‘‘ఇక్కడివారికి ఉన్న ప్రశాంత హృదయం నా కుమారుడికి ఎందుకు లేదు?’’ అంటూ వాపోసాగాడు.

జీవకుడు చిన్నగా నవ్వి, ''మనం చేరవలసిన చోటికి వచ్చి చేరాం మహారాజా! అదిగో తమరు సందర్శించవలసిన మహానుభావుడు!'' అన్నాడు చేయి చూపుతూ.

మరుక్షణమే ఏదో మాయాజాలంలా కాషాయాంబరాలు కనుమరుగయ్యాయి. సన్యాసులు వెనక్కు తగ్గారు. దూరంలో ఒక చెట్టు కింద ప్రసన్నవదనంతో... ''గౌతమ బుద్ధుడు!''

అజాతశత్రు గుండె వేగంగా కొట్టుకోసాగింది. మరుక్షణం ఏదీ తెలియని శూన్యం. అతనికి తెలియకుండానే వెళ్ళి ఆయన పాదాల వద్ద మోకరిల్లాడు. చేతులు జోడించాడు. ఆ దివ్యస్వరూపాన్ని ఒక్కసారి సందర్శిస్తే చాలు. ఎలాంటి స్త్రీ పురుషులైనా కరుణార్ద్ర చిత్తంతో కరిగి పోవలసిందే!

బుద్ధుణ్ణి కూడా హతమార్చాలని ప్రయత్నించానని దేవదత్తుడు అన్న మాటలు మనసులో ములుకుల్లా మెదిలాయి.

''నేను దేవదత్తుడి మాటలు విని ఉండకూడదు. ఆలకించాను, ఏళ్ళ తరబడి పేరుకుపోయిన ఆశానిరాశలు, ఆగ్రహావేశాలు, నిస్పృహలు, పశ్చాత్తాపాలు కన్నీళ్ళలా పెల్లుబికి-మెరిసే జ్ఞాన నేత్రాలతో ప్రసన్న వదనంతో చెట్టు కింద ఆసీనుడైన మహానుభావుడి పాదాలను కడిగాయి.

''ప్రభువులు నా అతిక్రమణను క్షమించి, మునుముందు ఎలాంటి ఘోర అపరాధం వాటిల్లకుండా నన్ను నేను నియంత్రించుకోవడానికి కరుణ చూపాలి.''

మరి కొన్ని గంటలలో నగరానికి తిరుగుముఖం పట్టిన రాజు పరిపూర్ణ తృప్తితో ప్రశాంతంగా ఉండడం జీవకుడు గమనించాడు. ఆయన కళ్ళల్లో కాంతి. ఓ విధమైన ఉత్సాహం.

జీవకుడు చిన్నగా నవ్వుకున్నాడు. అజాతశత్రు బుద్ధుణ్ణి దర్శించినప్పుడు తను సన్యాసుల మధ్యనే ఉండిపోయాడు. వాళ్ళిద్దరు ఏం మాట్లాడుకున్నారో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది.

''మన ఈ ప్రయాణం వృథా కాలేదన్నది నాకెంతో ఆనందం కలిగిస్తున్నది. ప్రభువులకు మేలు కలిగింది కదా?'' అని అడిగాడు జీవకుడు.

''నేను పరిశుద్ధుణ్ణయ్యాను, జీవకా?'' అంటూ అజాతశత్రు, జీవకుడి చేతులు పట్టుకుని, ''నీకు కృతజ్ఞత ఎలా చెప్పాలో తెలియడం లేదు. హృదయపూర్వక కృతజ్ఞతలు స్వీకరించు మిత్రమా,'' అన్నాడు.

''తమకు సాయమందించడం నాకు పరమానందం కలిగిస్తున్నది. అయినా, తమకు ఇబ్బంది లేదనుకుంటే తమతో బుద్ధుడేమన్నాడో తెలుసుకోవాలని ఉన్నది,'' అన్నాడు జీవకుడు.

అజాతశత్రు అందమైన మందహాసం చిందిస్తూ, ''ఏమీ లేదు,'' అన్నప్పుడు ఆయన ముఖం ఆనందంతో వెల్లివిరిసింది. జీవకుడు అర్థం చేసుకున్నాడు.

–పవిత్రా శ్రీనివాసన్



మహనీయుల జీవితాల గురించి telugu.chandamama.com లో చదవండి





# క్యోలాడో నేషనల్ పార్క్



భరత్‌పూర్ పక్షుల శరణాలయంగా ప్రసిద్ధిగాంచినదే క్యోలాడో నేషనల్ పార్క్ అనే ఈ జాతీయోద్యానం.

రాజస్థాన్‌లోని భరత్‌పూర్ పట్టణానికి రెండు కి.మీ. అగ్నేయ దిశలో ఉన్నదీ ఉద్యానవనం. ఇండో-గేంజటిక్ మైదానాల పైభాగంలో చిత్తడి నేలలో దీనిని కృత్రిమంగా సృష్టించి నిర్వహిస్తున్నారు.

దీని పరిధిలో ఉన్న క్యోలోడో(శివ) ఆలయం కారణంగా ఈ శరణాలయానికి ఈ పేరు పెట్టారు.

1850 వరకు ఈ ప్రాంతం భరత్‌పూర్ రాజాలకు వేటాడే వన ప్రదేశంగా ఉండేది. బ్రిటిష్ వైస్రాయిల గౌరవార్థం యేటా 'డక్ షూట్స్' ఏర్పాటు చేసేవారు. 1938లో ఆనాటి ఇండియా గవర్నర్ జనరల్ లార్డ్ లిన్‌లిత్‌గో ఒక్కదెబ్బకు మల్లార్డ్స్ వంటి 4,273 పక్షులను చంపేశాడు. దేశం స్వాతంత్ర్యం పొందాక 1972 వరకు సంస్థానాధీశులకు వేటాడే హక్కు ఉండేది.

ఆఫ్ఘనిస్థాన్, టర్క్‌మెనిస్థాన్, చైనా, సైబీరియాల నుంచి శీతాకాలంలో వచ్చే వలస పక్షులకు ఈ ఉద్యానవనం ప్రధానంగా ఆవాస స్థలంగా ఉంటోంది. అరుదైన సైబీరియా కొంగలతో పాటు ఇక్కడ 364 జాతుల పక్షులు ఉంటున్నాయి.

1985లో యునెస్కో దీనిని ప్రపంచ వారసత్వ స్థలాల జాబితాలోకి తీసుకున్నది.

**వెళ్ళి చూడడానికి ఉత్తమమైన కాలం:**
నవంబర్ నుంచి మార్చ్ వరకు. అన్ని రోజులూ ఉదయం నుంచి సాయంకాలం వరకు తెరవబడి ఉంటుంది.

**అక్కడికి చేరుకోవడం ఎలా?**
రాజస్థాన్‌లోని భరత్‌పూర్ న్యూఢిల్లీకి వాయవ్య దిశగా 11వ నేషనల్ హైవే మీదుగా ఉన్నది. ఆగ్రాకు(60కి.మీ.), జయ్‌పూర్‌కు(180కి.మీ.), న్యూఢిల్లీకి (ఫతేపూర్ సిక్రీ, ఆగ్రాల మీదుగా 175కి.మీ. దూరంలో ఉన్నది), న్యూఢిల్లీ నుంచి వచ్చే చాలా రైళ్ళు భరత్‌పూర్‌లో ఆగుతాయి.

మనదేశంలో 'స్పైస్ గార్డెన్'గా ప్రసిద్ధిగాంచిన రాష్ట్రం ఏది?
a) కేరళ b) కర్ణాటక
మీ సమాధానాన్ని CIHQ <space><a\b>54646కు SMS చెయ్యండి. మరియు మీ మొబైల్లో ఇండియన్ హెరిటేజ్ క్విజ్ ఆడుకోండి.

హెరిటేజ్ క్విజ్‌కు మీ సమాధానం పంపండి sms CIHQ <మీ సమాధానం> to 54646



# దిద్దుబాటు



కేశవగిరికి చెందిన వల్లభరాయుడు, సారంగపాణి చేసేది ఒకే వ్యాపారం. సజ్జ, రాగి, జొన్న మొదలైన ధాన్యాలను రైతుల వద్ద కొనుగోలు చేసి పట్టణంలోని సంతకు తీసుకువెళ్ళి అమ్మేవారు. అయితే, అదేమి చిత్రమోగాని వల్లభరాయుడు తీసుకువెళ్ళిన సరుకులకు ధరలు బాగా పలికి మంచి లాభాలు వచ్చేవి. సారంగపాణి తీసుకువెళ్ళే చోట అందుకు విరుద్ధంగా జరిగి నష్టాలే మిగిలేవి!

ఒకనాడు వల్లభరాయుడు ఆ విషయాన్నే ప్రస్తావించి, ``నువ్వు ఏ వ్యాపారం చేసినా నష్టం తప్పదు. నీ తలరాత అది. నేను మట్టి పట్టుకుపోయినా బంగారంలా అమ్ముడవుతుంది. నా అదృష్టం అది,'' అంటూ హేళన చేశాడు సారంగపాణిని. దానిని తీరని అవమానంగా భావించి, సారంగపాణి భార్య కుసుమవతితో చెప్పి బాధపడ్డాడు.

``వల్లభరాయుడికి డబ్బు పొగరుతో కళ్ళు మూసుకుపోయిన మాట నిజమే. అయినా అతడన్న మాటల్లో ఉన్న వాస్తవాన్ని కూడా మనం చూడాలికదా? నా మాట విని వ్యాపారం మానేయండి. ఏ గుమాస్తా ఉద్యోగమైనా దొరక్కపోదు,'' అని సలహా ఇచ్చింది భార్య.

భార్య మాటలు రుచించకపోయినా సారంగపాణి ఆలోచనలో పడ్డాడు. బాగా ఆలోచించి వడ్డీ వ్యాపారి వద్దకు వెళ్ళి చేతికి పెట్టుకున్న తాతలనాటి బంగారు కడియాన్ని తీసి తాకట్టుపెట్టి, కొంత మొత్తం తీసుకున్నాడు. పెద్ద మొత్తం సంపాదించుకుని గానీ తిరిగి రానని భార్యకు చెప్పి ఊరు వదిలిపెట్టాడు.

దూరప్రాంతంలోని ఒక రేవుపట్టణం చేరుకుని, అక్కడి సంతలకు వచ్చే చింతపండు, బెల్లం, మిరపకాయలు మొదలైన సరకులను కొద్ది కొద్దిగా కొని మారుబేరాలకు అమ్మడం మొదలుపెట్టాడు. కాలం కలిసిరావడంతో మెల్లమెల్లగా చిన్న పెద్దమొత్తాలలో లాభాలు రాసాగాయి. ఐదేళ్ళు గడిచేసరికి అతడి వద్ద లక్ష వరహాలు పోగయ్యాయి. అప్పుడు ఇంటికి



వెళ్ళాలని నిర్ణయించి సంతోషంగా తిరుగు ప్రయాణమయ్యాడు.

ఒకనాటి సాయంకాలం సారంగపాణి బస చేసిన సత్రానికే, వల్లభరాయుడు వచ్చాడు. చాలా కాలం తరవాత దూరప్రాంతంలో అనుకోకుండా కలవడంతో ఇరువురి ఆనందానికీ హద్దులు లేకుండా పోయాయి. కుశల ప్రశ్నల తరవాత లక్ష వరహాలు సంపాదించినందుకు సారంగపాణిని వల్లభరాయుడు అభినందించాడు. తెల్లవారగానే ఇద్దరూ కలిసే స్వస్థలానికి వెళ్ళాలనుకున్నారు.

అయితే, ఆ రాత్రి ఊహించని ప్రమాదం ముంచుకువచ్చింది. అర్ధరాత్రి సమయంలో బందిపోటు దొంగల ముఠా సత్రంపై దాడి చేసింది. అడ్డు పడిన వాళ్ళందరినీ దుడ్డుకర్రలతో చావగొడుతూ దొరికింది దోచుకోసాగారు. ఆ గందరగోళంలో సారంగపాణి తల పగిలింది. కొన ప్రాణాలతో ఉన్న అతడు, ''వల్లభా, త్వరగా ఇక్కడి నుంచి పారిపో! ఈ డబ్బును నా భార్యా బిడ్డలకు ఇవ్వు,'' అంటూ డబ్బు సంచీని అతడికిచ్చి తల వాల్చేశాడు.

వల్లభరాయుడు తెలివిగా దొంగల బారి నుంచి తప్పించుకున్నాడు. సారంగపాణి దుస్థితికి విచారిస్తూ, మూడు రోజుల తరవాత ఇల్లు చేరుకున్నాడు. డబ్బు సంచీ ఇవ్వడానికి సారంగపాణి ఇంటికి వెళ్ళబోతూంటే అతడి భార్య శేషమ్మ అడ్డుపడి, ''దొంగలు పడ్డ సమయంలో అతడు మీ చేతికివ్వకపోతే ఈ డబ్బు ఏమై ఉండేది?'' అని అడిగింది. ''దొంగలపాలయ్యేది,'' అన్నాడు వల్లభరాయుడు.

''అంటే, సారంగపాణి తన డబ్బు పోగొట్టుకున్నట్టే లెక్క. ఆ సమయానికి మీరక్కడ ఉండడం మీ అదృష్టం. దొంగల బారి నుంచి తప్పించుకోవడానికి కారణం మీ తెలివితేటలు. అందువల్ల, మీ అదృష్టంతోనూ, తెలివితేటలతోనూ కష్టపడి సంపాదించుకున్న డబ్బు అది. చచ్చిన సారంగపాణి డబ్బడగడానికి లేచి రాడు. సాక్ష్యమూ లేదు,'' అన్నది శేషమ్మ.

''కానీ, కుసుమవతి కష్టాల్లో ఉంది. పారుగువారికి ఇంత ద్రోహం చెయ్యడం మహాపాపం,'' అన్నాడు వల్లభరాయుడు.

''ప్రపంచంలో ఇంత కన్నా కష్టపడేవాళ్ళు లేరా ఏం? భగవంతుడు బాగుపడమని అవకాశం ఇచ్చాడు. తలుపుతట్టిన అదృష్టాన్ని తరిమికొట్టకండి,'' అన్నది శేషమ్మ.

ఆ మాటతో వల్లభరాయుడు మెత్తబడి పోయాడు. డబ్బు సంచీని తెచ్చి ఇంట్లో దాచేసి ఏమీ ఎరగనట్టు ఉండిపోయాడు. ఆ తరవాత నెల తిరిగేసరికి ఆ ఊళ్ళో తనకున్న ఆస్తిపాస్తులను అమ్మేసి, ఆ డబ్బునూ, సారంగపాణి ఇచ్చిన లక్షవరహాలనూ తీసుకుని రంగపట్నం చేరి హాయిగా జీవించసాగాడు.

సత్రంలో జరిగిన దొంగలదాడిలో సారంగపాణి తీవ్రంగా గాయపడ్డాడుగాని, ప్రాణాలు కోల్పోలేదు. స్పృహ కోల్పోయిన అతణ్ణి వైద్యశాలలో చేర్పించారు. పూర్తిగా కోలుకుని లేచి నడవడానికి ఆరు నెలలు పట్టింది. కేశవగిరికి తిరిగి వెళితే అక్కడ కుటుంబ పరిస్థితి దయనీయంగా ఉంది. వల్లభరాయుడు చేసిన ద్రోహం తలుచుకుని బాధపడ్డాడు గాని, ఏమీ చేయలేక అంతా తన ప్రాప్తం అనుకుని ఎప్పటిలాగే కుటుంబ భారాన్ని మోయసాగాడు.

వల్లభరాయుడి ఒక్కగానొక్క కూతురు వనజ పెళ్ళీడుకు వచ్చింది. ఆమె ఒకసారి పడవమీద నదిని దాటుతూండగా పడవ గల్లంతయింది. నీళ్ళల్లో పడి ఉక్కిరిబిక్కిర వుతూన్న ఆమెను వసంతుడనే ఒక యువకుడు కాపాడాడు. వనజ అతనికి తన చూపులతోనే కృతజ్ఞత తెలియజేసింది.

మరుసటి శుక్రవారం సాయంకాలం తల్లిదండ్రులతో కలిసి వనజ లలితాంబిక ఆలయానికి వెళ్ళి వస్తూండగా, వసంతుడు ఎదురయ్యాడు. వనజ తల్లిదండ్రులకు అతడు తనను కాపాడిన సంగతి గుర్తు చేసి వాళ్ళకు సమ్మతమైతే అతణ్ణే పెళ్ళి చేసుకుంటానని



చెప్పింది. కూతురు ఏది అడిగినా కాదనని వల్లభరాయుడు వసంతుడి వివరాలను సేకరించాడు. అతడి తల్లిదండ్రులు ఏదో పల్లెటూరిలో ఉన్నారనీ, అతడు చిన్నప్పటి నుంచి రంగపట్నంలోని మేనమామ ఇంట్లో ఉంటూ చదువుకుని ఒక గురుకుల పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాడనీ తెలియవచ్చింది.

ఆ తరవాత వల్లభరాయుడు తన కూతురిని అతడికిచ్చి పెళ్ళి చేయడానికి అంగీకరించి పెళ్ళి ఏర్పాట్లలో నిమగ్నుడయ్యాడు.

పెళ్ళి రోజు రానేవచ్చింది. వసంతుడు పెళ్ళికొడుకుగా ముస్తాబై మేనమామతో సహా తల్లిదండ్రులను కూడా వెంటబెట్టుకుని వచ్చాడు. వాళ్ళను చూడగానే వల్లభరాయుడు

దిగ్భ్రాంతి చెందాడు. వాళ్ళెవరో కాదు. సారంగపాణి దంపతులు!

''నాపై పగతీర్చుకోవడానికి నీ కొడుకును అస్త్రంగా ఉపయోగించావా? అన్నెంపున్నెం ఎరుగని ఆడపిల్ల జీవితంతో ఆట్లాడుకుంటావా?'' అన్నాడు వల్లభరాయుడు కోపంగా.

''ఇందులో నా ప్రమేయం ఏదీ లేదు మిత్రమా! అయినా, ఆ రోజు నేనిచ్చిన డబ్బు నువ్వు మా ఇంట్లో ఇవ్వకపోతే, నీ కూతురు కన్యాశుల్కం కింద ఉంచుకున్నావనుకున్నాను. ఇప్పుడిలా కోప్పడుతున్నావెందుకు?'' అన్నాడు వల్లభరాయుడితో సారంగపాణి ఛలోక్తిగా.

''నీ కొడుకును నా అల్లుణ్ణి చేసి, నా ఆస్తిని కాజేయాలన్నదే కదా నీ ఉద్దేశం?'' అన్నాడు వల్లభరాయుడు.

''నాకలాంటి ఉద్దేశం ఏ కోశానా లేదు. మీరిప్పుడు కాదనుకున్నా నాకు అభ్యంతరం లేదు,'' అన్నాడు సారంగపాణి.

అంతలో అక్కడికి వచ్చిన శేషమ్మ భర్తను పక్కకు పిలిచి పెళ్ళిని ఆపెయ్యమని చెప్పింది.



''పీటలమీది పెళ్ళి ఆగిపోతే ఆ తరవాత మన అమ్మాయిని ఎవరు చేసుకుంటారు. ఆ రోజు నీ మాట విని బుద్ధి గడ్డితిని సారంగపాణికి ద్రోహం తలపెట్టాను. ఇప్పుడు సరిదిద్దుకునే అవకాశం వచ్చింది. దాన్ని జారవిడుచుకోకూడదు. నీతిమంతుడైన సారంగపాణి కోడలుగా, గుణవంతుడైన వసంతుడి భార్యగా మన బిడ్డ సుఖపడుతుంది,'' అన్నాడు.

ఆ తరవాత వనజ, వసంతుల వివాహం ఘనంగా జరిగింది. రెండు కుటుంబాల్లోనూ ఆనందం వెల్లివిరిసింది.

-గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు





# గృహలక్ష్మి



శారదాపురంలోని శివయ్యకు సొంత ఇల్లు సంపాదించుకోవాలన్న కోరిక బలంగా ఉండేది. శివయ్య తండ్రి రాఘవయ్య సొంత ఇల్లు సంపాదించుకోవాలన్న ఆశ నెరవేరకుండానే కన్నుమూశాడు. ఆయన బతికుండగా అప్పు డప్పుడు కొడుకుతో, ''నాయనా, పక్షులకు కూడా గూడు ఉంటుంది. మనిషికి సొంత ఇల్లు చాలా అవసరం. నేను ఎంత శ్రమపడినా ఆ ఆశనెరవేర్చుకోలేకపోయాను. నువ్వయినా నా ఆశనెరవేర్చావంటే చూసి సంతోషిస్తాను,'' అనేవాడు.

శివయ్య తండ్రి ఉన్నప్పుడే ఇంటికోసం పొదుపు చేయడం ప్రారంభించాడు. క్రమేణా పొదుపు మొత్తం పెరిగింది. అలాగే ఇంటి ధరలు కూడా పెరగడం శివయ్యను ఆందోళ నకు గురిచేసేది. ఇంటి ధరలకు, పొదుపు మొత్తానికి మధ్య ఉన్న అంతరం చూసి భయపడేవాడు. అయినా, తండ్రి మరణించి సంవత్సరం గడిచేసరికి ఇల్లు కొనితీరాలన్న పట్టుదలతో ఏదైనా ఇల్లు అమ్మకానికి ఉందని తెలిస్తే చాలు వెళ్ళి వాకబు చేసివచ్చేవాడు.

అటువంటి పరిస్థితుల్లో శివయ్యకు హరి నారాయణ అనే వ్యక్తి ఇల్లు అమ్ముతున్నట్టు తెలిసింది. పట్టణానికి వెళ్ళి స్థిరపడాలన్న ఉద్దేశంతో ఊళ్ళోని ఇల్లు అమ్మకానికి పెట్టి నట్టు తెలిసింది. శివయ్యకు హరినారాయణ ఇల్లు తెలుసు. అందమైన డాబా ఇల్లు అది. చుట్టూ ప్రహరీగోడ, పెరట్లో కూరగాయల పాదులు, పచ్చటి చెట్లు, పూలమొక్కలు కూడా ఉంటాయి. ఆ ఇల్లు కొనగలిగితే అదృ ష్టమేనని భావించిన శివయ్య వెళ్ళి హరినారా యణను కలిసి ధర విషయం అడిగాడు.

హరినారాయణ శివయ్యతో, ''ఇల్లు అమ్ముతున్న మాట వాస్తవం. అయితే పాతిక వేల వరహాలకు ఒక్క వరహా తగ్గినా అమ్మేది లేదు,'' అని నిర్మొహమాటంగా చెప్పేశాడు.

శివయ్యకు పాతికవేలు పెద్దమొత్తమే. అతడు అన్నాళ్ళు కష్టపడి పొదుపుచేసింది



ఇల్లు కొనేశాడు. ఇంటికి సున్నాలు, రంగులు వేయించి మంచి ముహూర్తాన గృహప్రవేశం చేసి, తండ్రి చెప్పిన మాట నెరవేర్చామని సంబరపడిపోయాడు.

పక్షం రోజుల తరవాత కోదండపాణి అనే స్నేహితుడు శివయ్యను చూడవచ్చి, ''ఇల్లు ఎంతకు కొన్నావు?'' అని అడిగాడు.

''పాతిక వేలు,'' అన్నాడు శివయ్య.

''చాలా ఎక్కువ పెట్టావు. ఆ మొత్తానికి పట్టణంలోనే ఇంతకు మించిన ఇల్లు వచ్చేది,'' అన్నాడు.

శివయ్యకు మనసులో దిగులుగా అనిపించింది. మరో వారం తరవాత వచ్చిన మామగారు, ''ఏం చూసి పాతికవేలు పోసి ఈ ఇల్లు కొన్నావు? నేను పెట్టిన నా కూతురి బంగారం అమ్మి మరీ కొన్నావంటే అదేదో పెద్దమేడ అనుకున్నాను. ఈ డాబా ఇంటికి నువ్వు పెట్టింది చాలా ఎక్కువ. తీర్థయాత్రకు వెళ్ళి గృహప్రవేశానికి రాలేకపోయానుగాని, వచ్చి ఉంటే అప్పుడే చెప్పేవాణ్ణి,'' అని అన్నాడు.

మరి కొందరు పరిచితులు కూడా, ''తొందరపడి ఎక్కువ మొత్తం పెట్టావు. మాతో మాట వరసకు ఒకమాట చెప్పివున్నా హరినారాయణతో మాట్లాడి ధర తగ్గించి ఉండేవాళ్ళం. అది హరినారాయణ అదృష్టం,'' అంటూ వ్యాఖ్యానించసాగారు.

ఇవన్నీ వింటూంటే బంగారం అమ్మి, అప్పులు చేసి ఇల్లుకొని తప్పుచేశానేమో అని శివయ్య మథనపడసాగాడు. దాంతో అతనికి ఇల్లుకొన్న ఆనందం అడుగంటిపోయింది.

పదిహేను వేల వరహాలకు మించి ఉండదు. అందుకే మారు మాట్లాడకుండా వచ్చేశాడు. అయితే ఆ క్షణం నుంచి అతనికి నిద్ర కరువయింది.

శివయ్య భార్య కమలమ్మ భర్త బాధను కనిపెట్టి, ''అవసరమైతే నా బంగారం అమ్మండి. కాలం కలిసివస్తే తరవాత కొనుక్కోవచ్చు,'' అని భర్తకు సలహా ఇచ్చింది.

శివయ్య సంతోషంగా ఆమె నగలను తీసుకు వెళ్ళి స్వర్ణకారుడికి చూపించాడు. అతడు వాటికి ఐదువేల వరహాలు వస్తాయని చెప్పాడు.

మరో ఐదువేల వరహాలు సర్దడానికి శివయ్య చాలా అగచాట్లు పడ్డాడు. కొంత స్నేహితుల వద్ద, మరికొంత బంధువుల వద్ద అప్పుచేశాడు. మొత్తానికి హరినారాయణ

విచారంతో బాధపడసాగాడు. అతడి భార్య, ''అయిందేదో అయింది. దిగులుపడకండి,'' అని ఓదార్పు మాటలు చెప్పినా ప్రయోజనం కనిపించలేదు.

ఆ సమయంలో జ్ఞానానందుడనే సాధువు శారదాపురానికి వచ్చాడు. పలువురు ఆయన్ను దర్శించి ఆయన సలహాలు పొందసాగారు. శివయ్య కూడా ఆయన్ను ఏకాంతంలో కలుసుకుని తన మనసులోని బాధను బయట పెట్టాడు.

శివయ్య మాటలను సావధానంగా విన్న జ్ఞానానందుడు, ''శివయ్యా, నీకు ఇల్లు కొనాలన్న ఆలోచన రావడమే గొప్ప విషయం. దానిని సాకారం చేసుకోవడానికి నువ్వు చూపిన పట్టుదల, నీ భార్య అందించిన సహకారం, బంధుమిత్రుల సాయం అంతకన్నా గొప్ప విషయాలు. ఇవన్నీ కలిసి రావడం నీ అదృష్టాన్ని సూచిస్తున్నాయి. ఇక ఇంటి ధర విషయం అంటావా అది సాపేక్షం. ఒక మంచి పని చేస్తే పది మంది పది మాటలంటారు. కొందరయితే నీ ఆనందానికి కన్నాలు వేసే స్వభావం కలిగి ఉంటారు. అందువల్ల వాటిని పట్టించుకోవడం భావ్యం కాదు. నీకు ఇల్లు సమకూరడం భగవత్కృప! ఇంటినే లక్ష్మిగా భావించి, విచారం వదిలి శ్రమించి అప్పులు తీర్చుకోవడానికి ప్రయత్నించు. నీకు మేలు జరుగుతుంది. లక్ష్మీ కటాక్షంతో నీ ఇల్లు కళకళలాడుతుంది,'' అని సలహా ఇచ్చి ఆశీర్వదించాడు.

ఆ రాత్రి శివయ్యకు సుఖ నిద్ర పట్టింది. ఆ తరవాత ఎవరు ఇంటి ధరను గురించి ప్రస్తావించినా, ''ఇంతమంచి ఇల్లు దొరకడం నా అదృష్టం. అందుకు ఎంత ఇచ్చినా తక్కువే!'' అనేవాడు.

దాంతో అలా చెప్పేవారు దగ్గరికి రాలేక పోయారు. శివయ్య కష్టించి పనిచేసి, అప్పులు తీర్చేసి, కాలం కలిసిరావడంతో మరో యేడాది తిరిగేసరికి కొంత పొలం కూడా కొన్నాడు. చేతనైనంతలో పది మందికి సాయం చేస్తూ హాయిగా జీవించసాగాడు. -ఎస్.ఎస్.ఎస్. రావు



# ది నైక్-భూపతి టెన్నిస్ విలేజ్



టెన్నిస్ ఆటను సరైన పద్ధతిలో బోధించాలన్న ఆకాంక్షతో 1995వ సంవత్సరంలో బెంగళూరులో టెన్నిస్ విలేజ్ స్థాపించబడింది. తన కుమారుడు మహేష్ భూపతికి కోచింగ్ ఇవ్వాలన్న అతని తండ్రి ప్రయత్నమే ఈ అకాడెమీ ఆవిర్భావానికి మూలకారణం. తండ్రి సి.జి.కె.భూపతి కూడా ఈ క్రీడలో పదిహేనేళ్ళ అనుభవం గల చక్కటి క్రీడాకారుడు కావడం విశేషం. ''మన దేశానికి కావలసినదల్లా టెన్నిస్ పట్ల ఆసక్తిగలవాళ్ళు క్రమం తప్పకుండా కలుసుకుంటూ, తమ నైపుణ్యాలను మెరుగుపరుచుకుని క్రీడల్లో రాణించేలా చేయడానికి ఉపయోగపడే విధంగా ప్రపంచస్థాయి నాణ్యతగల టెన్నిస్ ఫెసిలిటీ,'' అని భావించేవారు సిజికె భూపతి. క్రీడాభిమానీ, రియల్ ఎస్టేట్ మేగ్నట్ అయిన దయానంద పాయ్ ఉదారసాయంతో భూపతి వరల్డ్ క్లాస్ టెన్నిస్ కల నిజమయింది. ప్రముఖ స్పోర్ట్స్ వియర్ బ్రాండ్ నైక్ భాగస్వామ్యంతో టెన్నిస్ విలేజ్ స్థాపించబడింది.

అంతర్జాతీయ ప్రమాణాలతో నిర్మించబడిన టెన్నిస్ అకాడెమీ సామర్థ్యంగల యువ క్రీడాకారులకు సకల సదుపాయాలను సమకూర్చి, టెన్నిస్‌క్రీడ ఆధార సూత్రాలను నేర్పడంతో పాటు, స్ఫూర్తిని కూడా కలిగించాలన్న ఆశయం కలిగి ఉన్నది. క్రీడాభిమాని అయిన కర్ణాటక మాజీ ముఖ్యమంత్రి ఎస్.ఎం.కృష్ణ ఈ అకాడెమీ ప్యాట్రన్!

ఈ అకాడెమీ ఏడాదికి ఏడాది అభివృద్ధి చెందిన విషయాన్ని గుర్తు చేసుకుంటూ, ''మరీ కొద్దిమంది ట్రెయినీలతో ఒక ప్లేకోర్టుతో దీనిని ప్రారంభించాం. ఇవాళ ఆస్ట్రేలియన్ ఓపెన్ కోర్ట్స్‌తో సరితూగ గల ఆరు స్టేట్-ఆఫ్-ది-ఆర్ట్ సింథటిక్ కోర్ట్స్‌తో అలరారుతున్నది. దక్షిణాసియాలోని ఉత్తమమైన కోర్టులతో ఒకటిగా ఇది ప్రసిద్ధిగాంచింది,'' అంటారు టెన్నిస్ విలేజ్ మేనేజర్ శ్రీరాములు.

3.5 ఎకరాల విస్తీర్ణంలో నిర్మించబడిన ఈ టెన్నిస్ విలేజ్‌లో జిమ్నాజియం, టెన్నిస్‌కు సంబంధించిన పుస్తకాలుగల చక్కటి లైబ్రరీ, వ్యాయామం, యోగాలలో శిక్షణా కేంద్రాలు, హెల్త్ క్లబ్, స్విమ్మింగ్ పూల్, జాగింగ్ ట్రాక్ అంటూ మరెన్నో సౌకర్యాలు, వసతులు

ఉన్నాయి. అక్కడే ఉండాలనుకునే విద్యార్థుల ఉపయోగానికి ఇరవై నాలుగు మంది విద్యార్థులు బస చేయడానికి వీలుగా రెండు భవనాలు ఉన్నాయి.

ఇక్కడ బిగినర్, ఇంటర్మీడియేట్, అడ్వాన్స్‌డ్ అంటూ మూడు రకాలుగా శిక్షణా కార్యక్రమాలు రూపొందించబడ్డాయి. విభిన్న వయో పరిమితులతో, విభిన్న శక్తిసామర్థ్యాలుగల వారికి అనుగుణంగా శిక్షణా పద్ధతులు రూపొందించబడి ఉన్నాయి. ప్రతి ఒక్క క్రీడాకారుడి, క్రీడాకారిణి శక్తిసామర్థ్యాలను, అవగాహనా శక్తిని అనుసరించి శిక్షణ ఇవ్వడానికి వీలుగా సుశిక్షితులైన పన్నెండు మంది ఫుల్‌టైమ్ కోచ్‌లు ఈ అకాడెమీలో పనిచేస్తున్నారు. ఆటలో లోపాలను అప్పటికప్పుడు సరిదిద్దుతూ కావలసిన ప్రోత్సాహాన్నందిస్తారు.

ప్రతి ఒక్కరి పట్ల వ్యక్తిగతమైన ప్రత్యేక శ్రద్ధ కనబరచడానికి వీలుగా ఒక బ్యాచ్‌లో ఇద్దరు విద్యార్థులే ఉంటారు. వాళ్ళు ఆడే ఆటలను, సాధించే ప్రగతిని, చేసే తప్పులను విమర్శనాత్మకమైన వ్యాఖ్యలతో కోచ్‌లు ఎప్పటికప్పుడు నమోదు చేస్తూ ఉంటారు. శిక్షణా సమయం ముగిశాక, తమ నేర్పునూ, నైపుణ్యాలనూ పెంపొందించుకోవడానికి ట్రెయినీలను తమ బ్యాచ్ కానటువంటి ఇతరులతో ఆడడానికి ప్రోత్సహిస్తారు.

''ప్రతి క్రీడాకారుడూ తనలో నిక్షిప్తమై ఉన్న శక్తి సామర్థ్యాలను వెలికి తీసుకురావడానికి వీలుగా బోధించే శక్తిసామర్థ్యాలు మాకు ఉన్నాయని మేము పరిపూర్ణంగా విశ్వసిస్తున్నాం. ఈ ప్రాంతంలోని సమర్థులను ఆకర్షించి వారికి కావలసిన చక్కని శిక్షణ ఇవ్వడానికిమేము పూనుకున్నాం,'' అంటున్నారు సి.జి.కె. భూపతి.

మహేష్ భూపతి, సానియా మీర్జా, రోహన్ బోపన్న మొదలైన అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన వరల్డ్ క్లాస్ ప్లేయర్లు ఈ అకాడెమీలో శిక్షణ పొందిన వారు కావడం విశేషం. ఈ అకాడెమీలో ప్రవేశించే ప్రతి ఒక్క టెన్నిస్ క్రీడాకారుడికీ అద్భుతమైన నేర్చుకునే అనుభవాన్ని తప్పక కలిగించగలమని ఈ టెన్నిస్ విలేజ్ నిర్వాహకులు ధీమా వ్యక్తం చేస్తున్నారు.


వివరాలకు:

వెబ్ చిరునామా : www.tennisvillage.net

టెలిఫోన్ నం. : 91 80 23641747

మొబైల్ నం. : 91 98861 44333

కాంటాక్ట్ పర్సన్ : శ్రీరాములు, మేనేజర్

చిరునామా : ది నైక్-భూపతి టెన్నిస్ విలేజ్, 183/4, కొడిగెహళ్ళి, టిండ్లూ రోడ్, విద్యారణ్యపుర పోస్ట్, బెంగళూరు-560097.




# ఉదయ తారలు

## జ్యోతి సురేఖ

విజయవాడకు చెందిన పదమూడేళ్ళ సురేఖ విలువిద్యలోనూ, ఈతలోనూ ప్రత్యేక ప్రతిభను కనబరుస్తోంది.

జ్యోతి మొదట ఈత పట్ల ఆసక్తి కనబరిచేది. మెల్లమెల్లగా ఆమె దృష్టి విల్లంబుల మీదికి కూడా వెళ్ళింది. తనకు సరిగా ఈత నేర్పించే కోచ్‌లు లేనందువల్ల ఆర్చెరీకి అంటే విలువిద్య కేసి దృష్టి సారిస్తున్నట్టు ఆమె చెబుతోంది. ''చదువులకూ, క్రీడలకూ మధ్య బ్యాలెన్స్ చెయ్యాలి గనక, ఒకే క్రీడ మీద అదీ ఆర్చెరీమీదే నా దృష్టిని కేంద్రీకరించాలనుకుంటున్నాను,'' అంటుందామె. ఆ యువ క్రీడాకారిణి చదువుకుంటూన్న నలందా విద్యానికేతన్ ఆమె వివిధ పోటీలలో పాల్గొనడానికి ప్రోత్సహిస్తోంది.

చెరుకూరి వోల్గా ఆర్చెరీ అకాడెమీలో ఆమె కాంపౌండ్‌బో గురిచూసి కొట్టడం అభ్యాసం చేస్తోంది. సిహెచ్ లెనిన్, జె.రామారావు ఆమెకు కోచింగ్ ఇస్తున్నారు. 2009 మార్చ్‌లో మెక్సికోలో జరిగిన వరల్డ్ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొనడానికి జ్యోతి ఎంపికయింది. 'నేనొక ప్రొఫెషనల్ ఆర్చెర్ కావాలన్నదే నా కోరిక,'' అంటోంది జ్యోతి ఎంతో ఆత్మవిశ్వాసంతో.



'కేవలం స్వప్రయోజనాల కోసం కాకుండా మన దేశానికి పేరుప్రఖ్యాతులు తీసుకురావడానికి జాతీయ స్థాయిలోనే కాక అంతర్జాతీయ పోటీలలో మన ప్రతిభను కనబరచాలి,'' అని చెబుతున్నప్పుడు ఆమె కళ్ళల్లో కాంతి మాటల్లో దేశ భక్తి తొణికిసలాడాయి.

కీర్తికిరీటంలో:

- 4 ఏళ్ళు 11 నెలల ప్రాయంలో కృష్ణానదిని (5కి.మీ.) ఈది దాటినందుకు లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో స్థానం సంపాదించింది.
- 2001లో ప్రతిభా పురస్కార్. 2004లో ఎక్సెప్షనల్ అచీవ్‌మెంట్ అవార్డ్.
- ఇంటర్నేషనల్ యు-13 ఆర్చెర్ ఛాంపియన్‌షిప్(మెక్సికన్ గ్రాండ్ ప్రి 2009)
- ఒలింపిక్ రౌండ్‌లో ఒక బంగారు పతకం.
- 50మీ., 30మీ. రౌండ్లలో 2 వెండి పతకాలు.
- ఓవరాల్ ఎఫ్ఐటీఏలో ఒక వెండి పతకం.
- 20మీ. రౌండ్‌లో ఒక కాంస్య పతకం.
- 2008లో నేషనల్ యు-13 ఆర్చెర్ ఛాంపియన్‌షిప్(6 బంగారు పతకాలు)

# డెసిషన్ ఫ్యాక్టర్!

ఫ్రెంచి భాషలో 'నాంపియర్' అంటే 'నిష్పక్ష పాతం' 'సమానం కానిది' అని అర్థాలున్నాయి. 'నాంపియర్' నుంచే 'అంపైర్' అనే మాట వచ్చింది. క్రికెట్ మ్యాచెస్ సమయంలో ఫీల్డులో ఇద్దరు అంపైర్లు - ఒకరు బౌలర్‌కు వెనక, మరొకరు స్క్వార్‌లెగ్ వద్ద అంటే బ్యాట్స్ మేన్‌కు ఎదురుగా నిలబడి ఉండడం సంప్రదాయంగా వస్తున్నది.

ఫీల్డులో ఉన్న అంపైర్లకు సహాయకులుగా ఆఫ్ ఫీల్డులో సరిచూసే అంపైర్‌ను నియమించే కాన్సెప్ట్‌ను శ్రీలంక మాజీ క్రీడాకారుడూ, రచయితా అయిన మహిందా విజెసింఘే ఊహించాడు. 1992 నవంబర్‌లో కింగ్స్‌మీడ్‌లో దక్షిణాఫ్రికా - ఇండియాల మధ్య జరిగిన మ్యాచ్ సమయంలో కార్ల్ లీబెన్ బెర్గ్, సిరిల్ మిట్చ్‌లే తొలి 'థర్డ్ అంపైర్'గా సాధికారంగా నియమించబడ్డారు. సచిన్ టెండూల్కర్‌కు విరుద్ధంగా తీసుకున్న రన్ అవుట్ నిర్ణయం తొలి థర్డ్ అంపైర్ ప్రయత్నం! శ్రీలంక 2002 ఐసిసి ఛాంపియన్స్ ట్రోఫీలో 'లెగ్ బిఫోర్ వికెట్' నిర్ణయానికి తొలిసారిగానూ, ఇంగ్లీష్ డొమెస్టిక్ ప్రా 40 మ్యాచెస్‌లోనూ థర్డ్ అంపైర్ సహాయం కోరబడింది.

'స్నికో' అని ఆప్యాయంగా పిలువబడే 'స్నికో మీటర్'ను 1990ల మధ్య అలన్ ప్లాస్కట్ రూపొందించాడు. స్నికో శబ్దాన్నీ, రూపాన్నీ గ్రాఫికల్‌గా విశ్లేషించి, ఏదైనా షార్ప్



వాయిస్ లేదా స్నిక్ ఉందా అని చూపుతుంది. బంతి నిజంగానే బ్యాట్‌కు తగిలిందా లేదా అన్న విషయాన్ని స్నికో మీటర్ సూచిస్తుంది. స్లో మోషన్ టెలివిజన్ డిస్‌ప్లేలో దీనిని ఉపయోగిస్తారు.

బంతి దూసుకువెళ్ళే మార్గాన్ని స్పష్టంగా తెలుసుకుని విశ్లేషించడానికి ది హాక్ ఐ ప్రెడిక్షన్ సాయపడుతుంది. డాక్టర్ పాల్ హాకింగ్స్ 2001లో రూపొందించిన హాక్ ఐ టెక్నాలజీని 2001 మే నెలలో లార్డ్స్ క్రికెట్ స్టేడియంలో ఇంగ్లాండు, పాకిస్థాన్‌ల మధ్య జరిగిన టెస్ట్ మ్యాచ్‌లో మొట్టమొదటిసారిగా చానెల్ 4 ఉపయోగించింది.




## ఎత్తయిన భవనం

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ దుబాయ్‌లో ప్రస్తుతం నిర్మిత మవుతున్న 'బుర్జ్ దుబాయ్' మానవ నిర్మితమైన ఎత్తయిన భవనం అన్న విశిష్టతను సంతరించుకోనున్నది. త్వరలో పూర్తి కానున్న ఈ భవన నిర్మాణం 2004 సెప్టెంబర్ 21వ తేదీ ప్రారంభించబడింది.

''డౌన్‌టౌన్ బుర్జ్ దుబాయ్'' అభివృద్ధిలో అంతర్భాగమైన ఈ భవనం షేక్ జాయేద్ రోడ్ మీదుగా 'ఫస్ట్ ఇంటర్ చేంజ్' ఫైనాన్సియల్ సెంటర్ రోడ్‌లో నిర్మించబడుతున్నది. దక్షిణ కొరియాకు చెందిన శామ్‌సంగ్ కార్పొరేషన్ ఈ భవనానికి ప్రధాన కాంట్రాక్టర్. ఈ ప్రాజెక్టుకు అయ్యే మొత్తం ఖర్చు 4.1 బిలియన్ అమెరికన్ డాలర్లు. కొత్త 'డౌన్‌టౌన్ దుబాయ్'కి అయ్యే మొత్తం వ్యయం 20 బిలియన్ అమెరికన్ డాలర్లు.

## అతిచిన్న సినిమా ప్రదర్శనశాల

రోమ్ నగరంలోని సినిమా డీ పిక్కోలీని అతి చిన్న సినిమాహాలుగా చెప్పవచ్చు. దాని మొదటి పేరు మికీ మౌస్ పేరు మీదుగా టోపోలినో సినిమా అని ఉండేది. ఇక్కడ కొత్త బాలల చిత్రాలు ప్రదర్శిస్తారు. ఈ సినిమాహాలులో 63 సీట్లు మాత్రమే ఉన్నాయి. ఆల్‌ఫ్రెడో అన్నీబాలీ నిర్మించిన ఈ హాలును 1943 నుంచి పబ్లిక్ హాలుగా చేశారు.

మొట్టమొదట ఇక్కడ దుప్పటిని తెరగానూ, పాత్‌బేబీ 9.5 ఎం.ఎం ప్రొజెక్టర్‌నూ ఉపయోగించేవారు. ప్రస్తుతం ఎయిర్ కండిషన్ చేయబడి స్టీరియో సౌండ్ ఏర్పాటు చేశారు. రెండు వెరొనీస్ ప్రొజెక్టర్లనుగానీ, సింగిల్ 16 ఎం.ఎం బార్ ప్రొజెక్టర్‌ను గానీ ఉపయోగిస్తున్నారు.




ఇంతటి గొప్ప చరిత్ర కలిగిన సినిమా డీ పిక్కోలీని గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ తన జాబితాలోకి తీసుకున్నది.



# హాస్యకథ

## హల్వా కావాలా?



ఉత్సాహంతో చాలాసేపు 'దాగుడు కేకలు' ఆడాక నేను, సునీల్, రాజీ మా ఇంట్లోకి జొరబడ్డాం. దాగుడుమూతలు విన్నాంగాని ఇదేమిటి 'దాగుడు కేకలు' అని ఆశ్చర్యపో తున్నారు కదూ! ఆ ఆటను మాకు మేమే కనుగొన్నాం. చడీచప్పుడు లేకుండా దాక్కు న్నవారిని వెతికి పట్టుకోవాలి. ఆ పట్టుకునే ముందు వీలైనంత వింతగా గట్టిగా కేక పెట్టాలి. ఆ ఆట ఆడడానికి చాలా చాలా ఉత్సాహంగానూ, వినోదంగానూ ఉంటుంది. నా మాట నమ్మండి! ఆడి ఆడి తెగ అలిసి పోయాం. ఫ్రిడ్జ్ తెరిచి చూసిన రాజీ, ''తినడా నికి ఏమీ లేదు!'' అంటూ నాకేసి నిరాశతో పెదవి విరిచింది. నేను గాఢంగా నిట్టూర్చాను.

స్టౌవ్ మీద ఏదో పిండిలాంటిది కుతకుత లాడుతూండడం గమనించాను. ఉడుకుతున్నది ఫలానా అని కనుగొనడంలో నిపుణుడైన వంట వాడంత నేర్పరిని నేను అని చెప్పానా?

''ఆహా! ఇదిగో ఇక్కడ హల్వా,'' అని వంట గదిలో నుంచి గది దద్దరిల్లేలా కేకవేశాను(ఇంకా దాగుడు కేకల మూడ్ నుంచి బయటపడలే దన్న మాట!).

ఇప్పుడు నా మిత్రులకు ఆనందం కలిగించ డానికి హల్వాకు మించినది లేదు.. అయితే, అద్భుతమైన నా ఘ్రాణశక్తి ఉడుకుతున్న పదా ర్థంలో ఎలాంటి వాసనా లేదని అప్పుడే పట్టే సింది. సరే దీన్ని ఎవరు తయారు చేస్తున్నారో ఊహించడం చాలా సులభం. మా అక్కయ్య శుభా అయివుంటుంది. ఆమె వంట చేయడం నేర్చుకుంటున్నది. మా అమ్మయితే హల్వాను దాని మానాన ఇలా వదిలి క్షణం కూడా అవత లికి కదలదు. నేను కొన్ని జార్లు తెరిచిచూసి మసాలాలు ఉన్నచోటును కనిపెట్టేశాను. ఆహా ఏలకులు! కొన్నిటిని తీసి పొడిచేసి ఉడుకు తూన్న హల్వాలో వేశాను. హల్వాకు రంగు లేకపోతే ఎలా? చిటికెడు కేసరిపౌడర్ కలిపాను. ఇదీ హల్వా అంటే. మిశ్రమాన్ని మెల్లగా గరిట సాయంతో కలయదీశాను. అందులో కొన్ని ఉండలు కనిపించాయి. అయినా, అమ్మ చేసే ప్పుడు అలాంటి ఉండలు వచ్చేవి కావు.

సునీల్ పాత్రలోకి వంగి ఆకలితో వాసన పీలుస్తూ, ''అద్భుతమైన వాసన! జీడిపప్పు కూడా వెయ్,'' అన్నాడు. నేను జీడిపప్పు పలుకులు వేసి మెల్లగా కలయదీస్తూంటే పక్కనే నిలబడి చూస్తూన్న రాజీ, ''ఈ హల్వా మనకు చాలదు బబ్లూ, ఏం చెయ్యాలో తెలుసా? పాలు పోసి

కొద్దిగా నీళ్ళు కలుపు చాలు,'' అని సలహా ఇచ్చింది.

ఆహా! నా స్నేహితులు కూడా ఈ విషయంలో నాలాగే చాలా తెలివైన వాళ్ళన్నమాట! నేనెంతో మురిసిపోయాను.

పాలు పోసి, అందులో కొద్దిగా నీళ్ళు కూడా కలిపాం. ఇప్పుడే మిశ్రమం సరైన పాకంలో పడుతున్నది. రాజీ అన్నట్టు అది మాకందరికీ సరిపోతుంది.

''ఇదేమి హల్వా?'' అని అడిగింది రాజీ మళ్ళీ.

నాకు ఏం చెప్పాలో తెలియలేదు.

''శుభాకు కొత్త రకం వంటలంటే మహా సరదా. దీన్ని బహుశా ఏ నెట్ నుంచో సేకరించి ఉంటుంది.''

''ఆమెను పిలువు. ఇలా వదిలి వెళ్ళిం దేమిటి?'' అన్నది రాజీ.



''అవును, శుభా..'' అని పిలుస్తూ వంట గది నుంచి బయటకు రాబోయాను.

సునీల్ నన్ను పట్టి వెనక్కు లాగి, ''ఎందుకా తొందరపాటు? మనమందరం కలిసే దీన్నింత గొప్పగా చేశాం. అవునా?'' అన్నాడు.

''అవును, దానికేం?''

''దాన్ని ప్రత్యేకంగా తయారు చేద్దాం. ఆంటీ వచ్చేలోపల..'' అంటూ సునీల్ కనుబొమలు పైకెత్తాడు.

అవును, అమ్మకు మేము హల్వా తయారు చేశామని చెప్పి ఆమె నుంచి మెప్పు పొందాలి. మేము ఆడే కొత్త కొత్త సృజనాత్మకమైనఆటలను ఆమె ఎప్పుడూ మెచ్చుకున్నది లేదు. ఇవాళ పొద్దున కూడా నేను రాజీ వెనక దాక్కుని, ఉన్న ట్టుండి వింతగా అరిచాను. దాన్ని చూడగానే, ''పొద్దస్తమానం ఆటలు తప్ప మరే ఆలోచనలూ లేవా? మీలో పెల్లుబికే శక్తిని ఇంట్లో వారికి సాయపడడానికి మళ్ళించవచ్చు కదా?'' అన్నది. మా అమ్మ యోగా తరగతులకు వెళుతుంది. శక్తిని మనకు ఇష్టమైన వాటి మీదికి నేర్పుగా మళ్ళించడం ఆమె అభిమాన విషయం!

నేనూ, నా స్నేహితులూ ఎలాంటి మంచి పనులు చేయగలమో నిరూపించడానికి ఇదొక అద్భుత అవకాశం! దీనిని జారవిడుచుకో కూడదు.

నేను గబగబా మెట్లెక్కి పైన ఉన్న మా అక్కయ్య గదిలోకి వెళ్ళాను. ఆమె స్నేహితు రాలికి కొత్తగా కొన్న తన బట్టలను చూపడంలో తలమునకలుగా ఉంది. అందువల్ల వంట గదిలో మరుగుతున్న హల్వా గురించి సాంతం మరిచిపోయిందన్నమాట! నేను మళ్ళీ కిందికి పరిగెత్తుకు వచ్చేశాను.

మేము మా బుద్ధినీ, మన సునూ, సృజనాత్మకతనూ పిండి, రంగరించి ఈ హల్వా తయారు చేశాం. దీన్ని మరింత ఆసక్తికరంగా తయారు చేసి, మా ప్రత్యేకమైన వంటగా నిరూపించుకోవాలని సునీల్‌సూచించాడు. బావుంది. రెండు టీస్పూన్ల మిల్క్ మెయిడ్ కలిపాం. ''వీటిని కూడా,'' అంటూ రాజీ కొన్ని ఖర్జూర ఫలాలను, అరటి పళ్ళను తీసి చూపింది. మేము చకచకా వాటిని చిన్న ముక్కలుగా కట్ చేసి అందులో కలిపాం. సునీల్ చిన్న బాటిల్ వెనిల్లా ఎస్సెన్స్ బయటకు తీశాడు. దాన్నుంచి రెండు చుక్కలు మా ప్రత్యేక పిండివంటలో వేశాం. ఇప్పుడది మరీ చిక్కగా తయారై పక్కలకు ముడతలు ముడతలుగా పొంగుతూ అంటుకుపోతున్నది.



''ఆహా! ఇప్పుడది పూర్తిగా హల్వాగా మారుతున్నది!'' అని సునీల్ ఆశ్చర్యపోయాడు.

అప్పుడనగానే మార్కెట్‌కు వెళ్ళిన అమ్మ తిరిగి వచ్చింది. ఆమె సంచులను మేజా మీద పెట్టి కొంగుతో నుదుటిని తుడుచుకున్నది.

మేము నవ్వుతూ ఆమె ఎదుట నుంచున్నాం.

''ఇవాళ ఏం అల్లరిపని చేశావు?'' అని అడిగింది నన్ను.(నేను రోజూ అల్లరి పనులు చేస్తాననుకోకండి సుమా..)

''మేము హల్వా తయారు చేశాం. ఆటలాడ్డమే కాదు. మాకు ఇతర పనులు కూడా చేయడం బాగా చేతనవును,'' అన్నాను నేను గర్వంగా నవ్వుతూ.

మేము తయారు చేసిన దాన్ని మా అమ్మ గుడ్లప్పగించి చూడసాగింది.

అంతవరకు తనగదిలోనే తిష్ఠవేసిన శుభా, తన స్నేహితురాలితో కిందికి దిగి వచ్చింది. ''చూడు, బబ్లూ వాడి స్నేహితులు కలిసి స్వయంగా హల్వా తయారు చేశారట...'' అన్నది అమ్మ కాస్త గొప్పగా.

శుభా మమ్మల్ని జంతువులను చూసినట్టు వింతగా చూసి వంటగదిలోకి అడుగుపెట్టింది. మరుక్షణమే హాలంతా ఆమె వేసిన ఒక్క కేకతో ప్రతిధ్వనించింది.

''నా చీరకు గంజి పెట్టడానికి స్టౌవ్ మీద గంజి పెట్టాను. అదేమయింది?'' అని అడిగింది శుభా.

అవసరం ఏర్పడినప్పుడు సంఘటనా స్థలం నుంచి క్షణాల్లో ఉడాయించడంలో మా అంతటి వాళ్ళు లేరని ముందే చెప్పాను కదా? మా అద్భుతమైన 'గంజి హల్వా'ను అక్కడ అలాగే వదిలేసి ఇంటి నుంచి జింక పిల్లల్లా పరుగు లంకించుకున్నాం.

అద్భుతమైన ఆ వంటలోకి మేము వేసిన వంట పదార్థాలను గనక మా అమ్మ పసిగట్టినట్టయితే నిస్సందేహంగా మాతో 'దాగుడు కేకలు' ఆడేస్తుంది!

–రమా రమేష్



# నవ్వుల పువ్వులు



ఉపాధ్యాయుడు: భూమి అక్షరేఖ అంటే ఏమిటి?
రోషన్: ఒక ధ్రువం నుంచి మరో ధ్రువానికి వెళ్ళే ఊహారేఖను భూమి అక్షరేఖ అంటారు. దానిమీదుగానే భూమి తిరుగుతూ ఉంటుంది.
ఉపాధ్యాయుడు: చక్కగా చెప్పావు. మరి ఆ రేఖ మీద బట్టలు ఆరవేయగలవా?
రోషన్: వేయగలను సార్.
ఉపాధ్యాయుడు: నిజంగానా? ఎలాంటి బట్టలు?
రోషన్: ఊహాత్మకమైన బట్టలు, సార్.



ఒక కుర్రాడు గుడిలో, ''దేవుడా! మాస్కోను చైనా రాజధానిగా చెయ్!'' అని ప్రార్థించసాగాడు. దానిని విన్న పూజారి, ''ఎందుకలా ప్రార్థిస్తున్నావు నాయనా?'' అని అడిగాడు.
''నా సమాధాన పత్రంలో అలాగే రాసి వచ్చాను మరి,'' అన్నాడు కుర్రాడు.



బామ్మ: సునీల్, మళ్ళీ నువ్వు సైన్సులో తక్కువ మార్కులే తెచ్చుకున్నావు. సిగ్గుపడాలి! నేను నీ వయసులో సైన్సులో మంచి మార్కులు తెచ్చుకునేదాన్ని తెలుసా?
సునీల్: అది చాలా సులభం. ఎందుకంటే మీ కాలంలో మరీ తక్కువ ఇన్వెన్షన్లు, తక్కువ మంది సైంటిస్టులే ఉండేవారు. ఇప్పుడలా కాదు కదా!

## దత్తు




భయమెరుగని
నలుగురు
అసలు
సంగతులు – 3
చిత్రాలు: గాంధీ అయ్య


సుధీర్ అంకుల్ వాళ్ళు చెప్పినదంతా ఆశ్చర్యంతో విన్నాడు.
బావుంది. పిల్లలయినప్పటికీ మీరెంతో మంచిపని చేశారు.
నీళ్ళ శాంపిల్‌ను తన ల్యాబ్‌లో పరీక్షించవచ్చని డా.చంద్ర చెప్పారు. గుర్తున్నది కదా?


కాళయ్యే దోషి అనుకుంటాను... మాతో రండి... అంకుల్.
సుధీర్ వాడికేసి ఎంతో స్నేహంగా చూస్తూ నవ్వాడు.
తప్పు. సరైన ఆధారం లేకుండా ఎవరి మీదా నిందారోపణ చేయకూడదు!


అవును. ఈ సంగతి మనకు ముందే ఎందుకు గుర్తురాలేదు?


జాస్మిన్ అద్దంకేసి పరధ్యానంగా చూసింది. ఉన్నట్టుండి అమితోత్సాహంతో కనిపించింది.
నాకు డా.చంద్ర తెలుసు. ఆయన్ను ఇంటర్వ్యూ కూడా చేశాను. ఆయన మనకు సాయం చేయగలడు.


ల్యాబ్ టెస్ట్ తప్పకుండా చాలా విషయాలను బయట పెడుతుంది. మీ ఇంట్లో ఉన్న నీళ్ళ క్యాన్ నుంచి కూజా నీళ్ళు తీసుకురండి.

అందరూ ల్యాబ్‌కు బయలుదేరారు. ఆ రోజు డా.చంద్ర కాస్త ఆలస్యంగా వస్తారని రిసెప్షన్‌లో చెప్పారు.

ఇప్పుడేం చేయమన్నారు?

మీరు ల్యాబ్ వద్ద వేచి ఉండొచ్చు. ఆయన త్వరలోనే రాగలడు.

సుధీర్ అంకుల్ తాము వచ్చిన పని గురించి ఆయనకు వివరించాడు.

ల్యాబ్‌లో ఒక వ్యక్తి వాళ్ళ వద్దకు వచ్చాడు.

నా పేరు అశోక్. రిసర్చ్ అసోసియేట్‌ను. నేను మీకేమైనా సాయపడగలనా?

ఓహో అదా! మా ల్యాబ్‌లో టెస్ట్ చేస్తామని డా.చంద్ర చెప్పారా?

అవును, సార్!

అశోక్ ఆలోచిస్తూ గడ్డం తడుముకున్నాడు.

ఇది ముఖ్యమైనదిలా కనిపిస్తోంది. ఆయన వచ్చేలోగా పరీక్షలు ప్రారంభిస్తే సమయం ఆదా అవుతుంది.

అశోక్ నీళ్లను రకరకాలుగా పరీక్షిస్తూంటే వాళ్ళు ఆతృతగా బయట కూర్చున్నారు.










ఫలితాలను చూసి అశోక్ దిగ్భ్రాంతి చెందాడు.
ఏమిటిది? క్లోరిన్ కాంపౌండ్ల మిశ్రమంగా ఉంది!


అశోక్ వాళ్ళ దగ్గరికి వచ్చాడు.
పరీక్షలు చేశాను. ఈ శ్యాంపిల్‌లో ఉన్న పదార్థాలు, డాక్టర్ చంద్ర రూపొందించిన వాటర్ ప్యూరిఫైయర్ ద్రావణంలో ఉన్నట్టే ఉన్నాయి.


ఒక్క నిమిషంలో గందరగోళంగా తయారయింది.


డా.చంద్ర వచ్చి పరధ్యానంగా వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.


అశోక్ చేతిలో ఉన్న పరీక్షల ఫలితాలను చూసి ఆందోళన చెందాడు.
డా.చంద్రా..! వాటర్ క్యాన్ నుంచి తెచ్చిన నీళ్ళను మేము ఇప్పుడే పరీక్షించి చూశాం.. ఇవే ఫలితాలు.


ఆయన లేచి పారిపోవాలని చూశాడు. కాని సుధీర్ ఆయన్ను కదలకుండా పట్టుకున్నాడు.
డా.చంద్రా, నువ్వేదో తప్పుచేసినట్టు భయపడుతున్నావు. ఏం జరిగిందేమిటి?


ల్యాబ్‌కు వెలుపల జోజో మొరగసాగింది.



ఎఫ్.డి.ఎ. అప్రూవల్ కోసం వేచి ఉండకుండా, ఓర్పు కోల్పోవడమే దీనికంతటికీ కారణం.
నా కొత్త ప్యూర్ఫైయర్ ఫార్ములేషన్ క్లోరిన్ కాంపౌండ్స్‌తో మనుషుల మీద ఎలా పనిచేస్తుందో పరీక్షించాలనుకున్నాను.
రాజాకు డబ్బు ఆశ చూపించి, తన షాపులో ఉన్న వాటర్ క్యాన్లలోకి చిన్న మోతాదులో దాన్ని ఇంజెక్ట్ చేయమని చెప్పాను...
క్యాన్లు తెరవబడకుండా అలాగే ఎందుకు కనిపించాయో నాకిప్పుడు అర్థమయింది.
లేదు. అతనికి తెలియదు.
కాళయ్యకు ఈ సంగతి తెలుసా?
ద్రావణం ఇంత దారుణంగా పనిచేస్తుందనుకోలేదు.
అంటే, కాళయ్య మిత్రుణ్ణే చూడడానికి వెళ్ళాడు.
నేనది నమ్మను. ప్రజల ఆరోగ్యంతో ఆటలాడుకోవడం... వెగటు పుట్టిస్తోంది!
ఇకపై నేనెప్పుడూ ఇలా చెయ్యను.
సుధీర్ అసిస్టెంట్ కమీషనర్‌కు ఫోన్ చేశాడు. రాజా గురించి కూడా ఆయనకు సమాచారం అందించాడు.
మర్మం ఛేదించబడింది. అందమైన పరిష్కారం లభించింది. పిల్లలయినప్పటికీ గొప్ప పని చేశారు. మీ కందుకు ట్రీట్ ఇస్తాను. నాతో రండి!
(అయిపోయింది)

